# భయంకర

# చోరాగ్రేసర చక్రవర్తి

(డిటెక్టివు నవల)



గ్రంథకర్త:

వాడ్రేవు మల్లపరాజుగారు



ప్రకాశకులు:

వి. [illegible]రుకూరి సుబ్బారావు అండ్ సన్స్

ప్రొప్రయిటర్సు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# సరస్వతీ బుక్ డిపో వారి నవలలు

| డిటెక్టివు నవలలు | రు.అ. |
|---|---|
| బంగారు బరిణె పా 1 | 1- 0 |
| డిటో పా 2 | 1- 0 |
| సుడిగాలి పా 1 | 1- 0 |
| డిటో పా 2 | 1- 0 |
| యమదూత (హత్యాచతుష్టయం) | 1- 0 |
| పేటికాంతరశవము పా 1 | 0-12 |
| డిటో పా 2 | 0-12 |
| భయంకరనారీపిశాచి | 0-12 |
| పరితాపదౌర్జన్యము | 0-12 |
| భయంకర చోరాగ్రేసర చక్రవర్తి | 0-12 |
| గజదొంగ | 0- 8 |
| శనిగ్రహము | 0- 8 |
| నేనే అనే బలేరాముడు | 0-12 |
| ఇందిర | 0- 8 |
| హంతకుడెవరు పా 1 | 0- 8 |
| డిటో పా 2 | 0- 8 |
| బందిపోటుదొంగ | 0-12 |
| **చరిత్రాత్మక నవలలు** | |
| వనదుర్గము | 1- 0 |
| తపోవనము | 1- 0 |
| జపమాలిక పా 1 | 1- 0 |
| డిటో పా 2 | 1- 0 |
| దాహముగొన్నకత్తి | 0-12 |
| వక్రరేఖ | 1- 0 |

| చరిత్రాత్మక నవలలు | రు.అ. |
|---|---|
| తానీషా | 1- 0 |
| తాజ్ మహల్ | 1- 0 |
| **సాంఘిక నవలలు** | |
| శిశుహత్య పా [illegible] | 0-12 |
| డిటో పా 2 | 0-12 |
| డిటో పా [illegible] | 0-12 |
| పేరింటికాపురము | 0-12 |
| గుడ్ షాట్ | 0- 4 |
| **వేగుచుక్క గ్రంథమాలవి** | |
| వాడేవీడు | 1- 8 |
| కోటీశు తనయ | 1- 8 |
| లోకభయంకరుడు | 2- 0 |
| పద్మరాగము | 1- 0 |
| కాశీఘట్టరహస్యములు | 1- 0 |
| చపల | 1- 0 |
| విషమరహస్యము | 1- 0 |
| ఉగ్రభైరవము | 1- 0 |
| రత్నపేటిక | 1- 8 |
| లండన్ రహస్యములు | 1- 0 |
| ప్రతిభ | 1- 0 |
| రేనార్ | 1- 0 |
| వివాహవిప్లవము | 1- 0 |
| మరణమందిరము | 1- 0 |
| మహామాయ | 0-14 |
| వీడేవాడు | 1- 0 |
| మిస్ మోర్టన్ | 1- 0 |

దొరకుచోటు : సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

భయంకర

# చోరాగ్రేసరచక్రవర్తి

అను

**భయంకరనారీపిశాచి**

మూడవ భాగము

[అపరాధ పరిశోధక నవల]

గ్రంథకర్త.

వాడ్రేవు మల్లపురాజుగారు



ప్రకాశకులు

కుసుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రొప్రయిటర్సు: సరస్వతీ బు. డిపో. విజయవాడ

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.

**1943**

# విషయసూచిక

*

# భయంకరచోరాగ్రేసరచక్రవర్తి

అను

# భయంకరనారీపిశాచి

(మూడవ భాగము)

## బైరాగి.

ప్రభాకరుడు తన పూర్ణప్రభావమున మింట ప్రజ్వరిల్లుచుండెను. సుమారు ండుగంటలు దాటివుండును. పట్టణములకెల్ల భాగ్యవంతమై భాషావ్యాప్తికెల్ల నద్వి యమై ఆంధ్రభాషాభిమానుల కనువగు గొప్ప భాండాగారవ్యాప్తమై యనేక మహా ద్వాంసులకు పుట్టినిల్లై ధన్వంత్రింబోలు భిషగర్వులతోను ననేకములగు విద్యా లతోను అనాధ శరణాలయములతోను యున్నతములగు ఆంగ్ల ఆంధ్ర వైద్యశాలల ను ధనదుని ధిక్కరించు ధనికులతోను బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులతోను ప్ప అరోగ్యమార్గముతోను సర్వ పాప సంహారియగు గోదావరి నదితోను లెక్కకు క్కుటమగు యంత్ర సముదాయముతోను నామమాత్రముననే పట్టణములకెల్ల రాజను మగొల్పు రాజమహేంద్రవరమును జాడని యాంధ్రుండుండడనియే చెప్పవచ్చును. సంఖ్యాకులగు విద్యార్థులతోను వర్తకశిఖామణులతోను తదితరులతోను సర్వదా ందడిగానేయుండును. పట్టణమున సుమారారేడు సత్రవులున్నను జనసమూదాయమున ని చాలవనియే చెప్పక తప్పదు. పురవీధులు సదా జనసమూహము లెక్కుడగుటచే ంతవిశాలముగ నున్నట్లు దోచవు. పట్టణమున రెండరోగ్యమార్గములందు తావగుట తెను పడమర గోదావరినది ప్రవహించుటచేతను వర్తకవ్యాపారముల కనువుగా నుం ంటచేత నదివిశాలమగు ప్రాముఖ్యతగాంచెను.

బెజవాడనుంచి నొక రైలుబండి బైలుదేరి రాజమండ్రి మీదుగా వాల్తేరు, ళ్ళును. అది రాజమండ్రి వచ్చుసరికి సుమారు రెండుగంటలగును. ఒకనాటిమధ్యాహ్న గా రైలుబండి గోదావరి స్టేషనుకు వచ్చుసరికి రెండుగంటలు సమీపించుచుండెను. డిగాలుపులు మిక్కుటముగ వీచుచుండెను. అందుండు ప్రయాణీకులలో కొందరు ము తమ సామానులతో నతిత్వరితముగ దిగుచు ప్లాటుఫారమును చి కాళ్ళకాలునను యముచేతను త్వరగ తమతమ టిక్కెట్లను ద్వారరక్షకునికిచ్చి బైటకుబోయి తమ మ గమ్యస్థానములను జేరుటకును మిక్కిలి యాతురతతో బోవుచుండిరి. కొంతసేపటి రైలుబండి యీలగొట్టి కదలెను.

ఆ రైలు దిగిన వారిలో నొక రిద్దరు కుంటి గ్రుడ్డివాళ్ళను బైరాగులునుగలరు. రివద్ద టిక్కెట్లు లేకపోవుటచేగాబోలు వారు నా ద్వారరక్షకుని Ticket Collector బుమారు ప్రార్థించి తమ్ములను బైటికిబోవ నాజ్ఞయిమ్మని కోరగా నా యుద్యోగి

వారివద్దనేమియు తనకు లభించదని గ్రహించి రెండు చరుపులను చరిచి మెడలబట్టి నావలకు గెంటివైచెను. అంత వారు బ్రతుకు జీవుడాయని యా దెబ్బలకు లక్ష్యపెట్టక రాజబాటను యితర మార్గస్థులవలెనే బోవుచుండిరి. ఆమార్గస్థులలో కొందరు బండ్లలోను కొందరు విడిగాను తమస్నేహితుల యిండ్లకును బంధుగులయిండ్లకును పూటకూళ్ల బసలకును సత్రవులకును బోవుచుండిరి.

కుంటి, గ్రుడ్డి, బైరాగులకు మిక్కిలి యనువగు నివాసమని ప్రసిద్ధిగాంచిన "కంభంవారి సత్రవు"నకు యిద్దరు బైరాగులు కాషాయాంబరములను ధరించి, చిరపరిచితులవలె బోవుచుండిరి. వారు సత్రవునకుబోయి తమసంచి మొదలగు వస్తువులను నొకచోటనుంచి "నారాయణా" అనుచు గూర్చుండిరి. తరువాత వారిలో నొకడు దిక్కులుపరికించి, మనుష్యులను దిలకించి, యేమియు దోపమిచే గాబోలు తన సంచి నుండి చిలిమిగొట్టమును దీసి, దానిలో నించుక పత్రినిపెట్టి, అగ్గిపుల్లను వెలిగించి చిన్నదమ్మును లాగెను. వెంటనే మరల రెండుమూడు దమ్ములను లాగి "నారాయణా" అని నుచ్చరించుచుండునంత "అయిస్కాంతము యినుము" న్యాయముగ నక్కడనుండు పరివ్రాజికాసముదాయము నొక్కుమ్మడి చిలిమిగొట్టము నాకర్షించుటచే వానియొద్దకు నొకరుతర్వాత మరియొకరు జేరుచు, వానితో మైత్రిసలుపు ప్రసంగములు చేయు మొదలిడుచు, మెల్లన వానిచేనుండు చిలిమిగొట్టమును హస్తముల గ్రహించుచు, నొక్కొక్కదమ్మును లాగుచు, యాపొగను నోటనుంచియు నాసికారంధ్రముల నుండియు వదలి చిన్ని మేఘములను గల్పించి నాసావడంతయు గప్పునట్లు జేయుచుండిరి. మధ్యమధ్య వారు సాంబమూర్తినిగురించియు, వేదాంతసారమును జర్చించుచు తత్వములను బాడుచు, కేవలము తన్మయత్వముచే మైమరచియుండిరేమో యనునట్లు జూపరులకు దోచుచుండిరి. ఇట్టి భగవద్భక్తులను సేవించుటకుగాను కడుదవ్వులనుండి వచ్చి వారి పాదద్వయములకు సాష్టాంగములుచేసి, పాదపూజలకు తమకున్నకాని పరకలను సమర్పించి పోవువారి యెదుట తత్వార్థవిమర్శ యతిమార్గము చర్చించి, వారి డెందములు కడు సంతసించులాగు చేయగల సామర్థ్య మీపరివ్రాజికుల కెంతయు గలదని చెప్పవచ్చును. అట్టి శక్తియే వీరికి లేకున్న వారి జ్ఞానవత్రికి ధన మెట్లువచ్చును ?

పద్మబాంధవు డస్తగిరి కరుగుచుండెను. శకుంతసంతతులు తమతమ కులాయములకు కిలకిలధ్వనులతో వడివడిగా బోవుచుండెను. పురవీధుల కిరుప్రక్కలయందు దీపస్తంభములలో దీపములు వెలిగించుచుండిరి. క్రమముగ జనసముదాయము తగ్గుచుండెను. వర్తకసంఘమువారు తమ వ్యాపారములను నాటికిగట్టిపెట్టి గృహములకుంబోవ నుద్యమించుచుండిరి.

అంత నాడు మధ్యాహ్నము శైలుమీదనుండివచ్చి, కంభంవారి సత్రములో బసచేసి, చిలిమిగొట్టమువల్ల స్నేహముగావించిన పరివ్రాజికుడు నదీతీరమునకు స్నానమునకు గాబోలు, చేత కమండలమును బట్టుకొని, పాంకోళ్ళమీద, నిరుప్రక్కలబోవు జనులవైపున కోరచూపులను ప్రసరించుచు బోవుచుండెను. జనుల సౌకర్యార్థమై పురపాలకసంఘము వారివలన గట్టబడిన శిలాసోపానములగుండా మన పరివ్రాజికుడు

నీటిరేవుకు దిగుచు, నిటునటు దిక్కులు పరికించుచు, తలపంకించుచు, రొట్టెలకు, సోపానములన్నియు దిగి, గంగవద్ద గూర్చుని, చేనున్న కమండలము నొద్దునపెట్టి పైనున్న చిన్నగావంచాను మొలకుబిగించి, పాదరక్షలను కమండలము ప్రక్కనే వదలి నీటిలో దిగుటకు సంసిద్ధుడైయుండెను.

తోడనే వానివెనుకనుండి "ఎవరు ?" అను శబ్దమొకటి వినిపించుటచే నాత డాదిక్కునకు దృష్టిని నిల్పి పరీక్షించ మొదలిడెను. కాని వాని కెవ్వరును గనుపించమి, తన యనుమానమును నివర్తించుటకు "నారాయణా" అని స్మరించి దోసె డుదకమునుదీసి బైట గట్టుపైబోసెను. ఇంతలో నొకనల్లని దీర్ఘకాయు డొకడు వాని ముందర సాక్షాత్కరించి యిట్లు ప్రసంగించ మొదలిడెను.

దీ—"నీ దేయూరు ?"

బై—"కోన్ హాయి—తుం—"

దీ—"నీకు తెనుగుతెల్దా ?"

బై—"క్యా—తెనింగి—అముకు—మాలుంనై" అని చెయ్యిపూపెను.

దీ—"మాలుంనైయా—తుముం నామం క్యా?

బై—"కైకు ?

దీ—"పరవానై—తు బోల్ జీ".

బై—"అముకు, నాంనై—సాధుహై తుం నామం క్యా ?

దీ—"జూట్ బోలునై జీ — అమర నామ, మారోచీ యూరదు."

బై—"అబ్బా ! చాలారోజుల్కిదర్శనం — మనము చాలా గొప్పస్నేహితు లము—దుగ—

దీ—"ఓరీ ! నీవా ! తెల్సింది. దా—కాదు.

బై—"అవును. భాయి" అనిబై రాగిపైకిమాట్లాడవద్దనియు సంకేతముగ మాట్లాడ వచ్చుననియు, నిశ్చయించుకొని యొకరి నొకరు నాలింగనముచేసికొని ఆనందభాష్పముల నదీజలమున వదలి కొంతదూరముఁబోయి సంగతులిట్లు మాట్లాడ దొడగిరి.

దీ—ఎన్నినాళ్ళకు దర్శనం ? ఎంత అదృష్టము భాయి—

బై—అవును భాయి— చాలా అదృష్టం—

దీ—ఎన్ని ఏళ్ళు భాయి—

బై—ఆరు—కఠినశిక్ష—

దీ—ఎప్పుడు వదలినారు భాయి—

బై—నాలుగురోజులు అయింది. అయితే సంగతు లేంటి ?

దీ—ఎంతపని జరిగింది భాయి— అంత ఖరాబు అయింది—

బై—అమ్మ ఎక్కడ ?

దీ—అమ్మా లేదు—అడవి లేదు—

బై—అమ్మగారు చనిపోయినారా ?

దీ— అవును ?

బై—అబ్బాయి!

దీ—అబ్బాయి సంగతి బాగాతెల్దు, ఇప్పుడు యిశాఖపట్టంలో వున్నాడు అని వాకబు—

బై—విచారముతో నిట్లని చింతించుచుండెను. తల్లీ! ఎంతలో దూరమైపోతివి! అహా! నీప్రేమ! నీకరుణ! నీఆలోచన! నీయూహ! నీప్రవర్తన! నీవిశ్వాసము! నీ తెలివి నద్వితీయములు. నిన్నెట్లు మరతును? నా చరానంతరము వచ్చి చిత్రాడలో నీవును బాబును యుందురని యోజించి అక్కడకుఁబోయి మీపాదసేవచేసి యుంద మని పుట్టెడాశతో కడునిడుములు గుడిచి వచ్చితిని. తుదకు నీమరణవార్తను వినియు అనువులంబాయకుంటిని. (ప్రకాశముగా) ఓరీ! బాబు యింకా యెన్ని సంవత్సరాలు చెరలోనుండవలెనో!

దీ—బాబు—యింకా యెనిమిది?

బై—బాగున్నది. విచారించిన లాభములేదు. మనజట్టు వారల ప్రోగుచేసి నీవు తప్పక విశాఖపట్టణము తీసుక్రా! మన మందరము ప్రయత్నముచేసి వాని చెరవిముక్తి నిగా చేయుదము. మీకు యథాప్రకారము మర్యాదలు జరుపుదును. మరువకుము—

దీ—ఎంతమాట—మేముకూడ ఆమె డబ్బు తినలేదా? మేమంత విశ్వాసహీనులమా? తప్పక వారందరిని దీసికొని వచ్చెదను—

బై—"మంచిది" అని వారిద్దరును యెక్కడికో బోయిరి. బైరాగి తన బసకు బోయి సంచి మొదలగు సామాగ్రి చేతబుచ్చుకొని రాజమండ్రి రైలుస్టేషనుకుగాబోలు పోవుచుండెను.

---

## 2 వ ప్రకరణము.

---

### నూతిలోరాయి.

ఆంధ్రదేశమున ముఖ్యపట్టణములలో విశాఖపట్టణ మొక గొప్పపట్టణమనియేఁ చెప్పవచ్చును. దాని ప్రాముఖ్యతకు ముఖ్యకారణములు రెండు (1) బంగాళానాగపూరు చెన్నపట్టణం దక్షిణమహారాష్ట్ర అయోమార్గములకు (B. N. R. & M. S. M. Junction) విడిపోవు తావగుటచేతను (1) తూర్పున సముద్రము పట్టణమునకు మిక్కిలి దగ్గఱగానుండుటచేత వర్తకవ్యాపారానుకూలమగుటయు, శీతోష్ణస్థితి మిక్కిలి సౌకర్య ముగా నుండుటచేతను, విశాఖపట్టణము విశాలమగు ప్రాముఖ్యత గాంచుచుండెను.

పురవీధులంత కుశలముగ లేవనియే చెప్పవచ్చును. రాజబాట Main Road. విశాలముగను, మిక్కిలి యున్నతములగు సౌధరాజంబులతోను, వానిముందర తేజస్సు గల దీపములతోను, జూచుట కానందముగ నుండును. ఆపట్టణములో జిల్లాయధికారి, యింజనీయరు యధికారి, న్యాయాధిపతిగారి కచ్చేరీలు మొదలగునవి మిక్కుటముగ నుండుటచేత ప్రజల రాకపోకలకు సదా యొడతెరిపియే లేదన వచ్చును. దొరతనము

వారు ప్రజలసౌకర్యార్థమై నేర్పరచినవానిలో ముఖ్యమగునది చికిత్సాలయమని (Hospital) వేరు చెప్పనక్కరలేదు. విశాఖపట్టణములలో ముఖ్యమైనది చికిత్సాలయమని చెప్పనక్కరలేదు. జార్జిసార్వభౌముని (King George's Hospital) చికిత్సాలయమును జూడని యాంధ్రుడుండడనియే చెప్పవచ్చును. ఆవిశాలమగు మందిరములు, వానిలో వివిధరోగుల కనువగు మంచములు, పరుపులు, జలయంత్రములు, విద్యుచ్ఛక్తి, దీపములు, మొదలగునవి నేత్రానందముగ నుండునని వేరె చెప్పనక్కరలేదు. జనులు సంధ్యాసమయమున సముద్రతీరమునకుఁబోయి, నిసుకతిన్నెలమీద కూర్చుని చల్లగాలిని సేవించుచు, సముద్రపుటలలుచేయు ధ్వనులచే హృదయముల సంతోషింపజేయుచు, నొకరితోనొకరు తమయిష్టాగోష్టిని చెప్పుకొనుచు ప్రొద్దుపుత్తురు. ఇకమోటారు బండ్లు విడి, సైకిళ్ళు గణగణమ్రోతలను కర్ణపుటములను భేదించుచుండునో యనునట్లుగాఁ దోచును.

ప్రయాణీకుల యుపయోగార్థమై జయపురం, బొబ్బిలి, విజయనగరం, మొదలగు సార్వభౌముల ద్రవ్యములచే నప్పటిజిల్లాయధికారి "టర్నర్" మహాశయుని జ్ఞాపకార్థ మొక గొప్పవిశాలమగు సత్రపు కట్టబడెను. ఆసత్రములో మార్గస్థులు వస్తుసామగ్రిని జాగ్రత్తగనుంచుకొనుటకును, వంటచేసికొనుటకును, యనుకూలమగునట్లు శిలానిర్మితపు గదులును, గదులకు వెనుక వసారాలును పెక్కులు గలవు. సుమారు నూరుమంది మార్గస్థు లొకసారి వంటచేసికొని నిద్రించుటకు సౌకర్యముగా నున్నదని చెప్పుటతిశయోక్తిగాదు. అది సదా మార్గస్థులచే నిండియేవుండును.

విశేషములను, వార్తలను, వింతలను, దెలియగోరువారు, వార్తాపత్రికలనుమించు సత్రవులవద్దను, జలాశయములవద్దను కాఫీహోటల్సులోను, నించుకఁ గూర్చుండిన సమస్తమును దెలియనున్నసంగతి స్వానుభవులకుఁ దెలియనిదికాదు. కాబట్టి మన మించుక టర్నర్ మహాశయుని సత్రవులవద్ద నిలచి పట్టణములలోను నితర గ్రామాదుల లోను గల విశేషముల నాలకింతము.

అక్కడొకచోట చికిత్సాలయమునుగురించి, చెప్పువారును, నూతనజనుల సముద్రమునుగురించి స్తోత్రముచేయుచు, దానిసౌకర్యములను చర్చించువారును, సత్రపు గుమాస్తాగారితో గదులను మాట్లాడువారును, తమకార్యానంతరమున తమతమ నివాసములకుఁ బోవువారును బస్తీలో వింతలుచెప్పుకొనువారునై యుండిరి. అందొకచోట సుమారునలుగురుచేరి యిట్లు ప్రసంగించుకొనుచుండిరి.

ప్ర—రాత్రి విశేషములేమిరా ?

ద్వి—గొప్పవిశేష మొకటికలదు.

తృ—అదేమిరా ! చెప్పుచెప్పు—

చ—మాకు తెలియని విశేష మేమి ?

ద్వి—రాత్రి చెరసాలలోనుంచి యొకపాతఖైదీ నూతిలోబడి చచ్చినాడట.

ప్ర—అదెట్లు ?

ద్వి—చెరకాపరుల కండ్లలో దుమ్ముగొట్టి—

తృ—సంగతి పూర్తిగ చెప్పరా—

ద్వి—తొందరపడకుము—చెప్పెదను.

ప్ర—వాడు పాతనేరస్తుడా? క్రొత్తవాడా?

ద్వి—ఆరు సంవత్సరములనుండి చెరసాలలోవుండి చెరవిముక్తుడగుటకు ప్రయత్నము చేయుచుండెను. తుదకిట్లు చేసెను.

చ—వాని యాప్సికమెట్లు నెరవేరినది?

ద్వి—శని వదలుటచే నెరవేరినది. దైవ మనుకూలుండైనప్పుడు ఎవరేమి చేయగలరు?

తృ—అవును సత్యమే—కథకాని—

ద్వి—కథకేం గాని మంచియెత్తుమీద దాటినాడు.

ప్ర—ఎక్కడకు దాటినాడు! ఇంతకుపూర్వమే చచ్చినా డంటివే?

ద్వి—అవును చచ్చినాడో, పారిపోయినాడో యింకా తెలియదు. అధికారులంతా నూతివద్దనుండి వెతికిస్తూవున్నారు.

చ—అసలు సంగతామూలాగ్రముగఁ జెప్పినంగాని తెలియదు. నీకు తెలిసినంత వరకు పుట్టినది పుట్టినట్లు చెప్పు.

ద్వి—అట్లే చెప్పెదను. ఈమధ్య క్రొత్తగ నొకడు చెరసాలలో (Jail) రక్షకభటునిక్రింద నెలకు రు 16_0_0 ల వేతనమునకు ప్రవేశించినాఁడట.

ప్ర—తరువాత?

ద్వి—వాడధికారులకు వారియాడవాండ్లకు బహునమ్మకముగ రాత్రింబగళ్ళు ప్రవర్తించుచుండెను. ఆకారణముచే వానిమీదందరికిని చాలప్రేమ, విశ్వాసము మిక్కుటమను.

తృ—బాగున్నది.

ద్వి—గతరాత్రి వానికొకభాగము (Ward) గస్తీడ్యూటీ వేసినారట. అంతవాడప్రమత్తుడై తిరుగుచుండుట వానియధికారులు జూచి సంతసించిరి.

ప్ర—బాగున్నది. వాడు మిక్కిలి తెలివైనవాడు.

ద్వి—రాత్రి వంటిగంటకు వానివద్దిలోనున్న యొకఖైదీ తనకు మిక్కుటముగు కడుపునొప్పి వచ్చుచున్నదనియు పాయిఖానకు బోవలెననియు చెప్పెనఁట. అంత యారక్షకభటుడు తన యధికారివద్దకుఁ బోయి సంగతి విన్నవించెను.

ప్ర—ఆయన సెలవుయిచ్చెనా?

ద్వి—శలవివ్వకుండు టెట్లు? ఆయన నిద్రమత్తుచేతను రక్షకభటునిమీద నుండు నమ్మకముచే నాగదిబీగముల వానికిచ్చెను.

ప్ర—బాగున్నది. పిమ్మట—

ద్వి—అంత రక్షకభటుడు తాళమునుదీసి మరల గది బంధించి తానా ఖయిదీతో పాయిఖానాకుఁ బోయెను.

తృ—తరువాత?

ద్వి—సుమారు గంటలో నా పాయిఖానా వైపునుండి పెద కేకలు వినబడినవట.

ప్ర—ఎవరివి ?

ద్వి—రక్షకభటునివి—ఖైయిదీవి—

ప్ర—బాగు—బాగు—

ద్వి—పిమ్మటనొక్క పెద్దపూలు వినబడినది.

ప్ర—బిగులు విని మిగతరక్షకభటులు వెళ్ళినారా ?

ద్వి—అంత పదిమంది రక్షకభటులు చెరసాలనుండి పరుగెత్తుచుండిరట. ఇంతలో పాయిఖానాకు సమీపముననున్న నూతిలో "దభాల్" అన్న గొప్పశబ్దము వినబడెను. అంత పరుగెత్తు భటులు "అయ్యో ! మిగిలినది. కార్యము పాడైపోయినది. ఖయిదీ రక్షకభటుని చంపినాఁడు. పదండి" అని పరుగెత్తుచు నూతియొద్దకుఁబోయిరి.

ప్ర—చాలచిత్రముగ నున్నది. అక్కడ ఖయిదీయుండెనా ?

ద్వి—ఎంత తెలివితక్కువవాడవు ? ఖయిదీ వుంటాడా ? వుండేయెడల అంత అడావిడెందుక్కు.

ప్ర—బాగుబాగు. చాల ఆశ్చర్యమైన సంగతి ? అక్కడ ఏమి గలదు !

ద్వి—రక్షకభటుని తుపాకియు కత్తి, టోపి, నూతివద్ద చెల్లాచదురుగ పడియుండెను. అంత వారిలో కొందరు పాయిఖానాను యితరచోట్లను వెదకిరిగాని కార్యము కనిపించనట్లు తోస్తుంది. అంత వారిలో కొంద రాయధికారులవద్దకుఁ బోయి యీవార్తను జెప్పిరి. అధికారులు తంతిలో (Telephone) పోలీసురక్షకభటాధ్యక్షునకును జిల్లా యధికారులకును జెప్పి తాము నూతివద్దకువచ్చి పరీక్షచేయుచుండిరి.

ప్ర—గొప్పచిత్రము. విశాఖపట్టణములో యెన్నడును వినని వింత జరిగినది.

ద్వి—అవును. ఇంకను పత్తేదారుడు పరిశోధించుచునేయుండెను. జిల్లాఅధికారి పరిశీలించుచునే యుండెను. నూతిలో దిగుటకును శవమును వెదకుటకును తగినసామగ్రి నిచ్చెనలు త్రాళ్ళు మొదలగునవి తెచ్చుచునే యుండిరి. ఇతరులను యెవ్వరిని లోనికి రానిచ్చుటలేదు. అప్పుడే పట్టణమంతయు గుప్పున పొంగిపోయినది.

ప్ర—సరే. పదండి మనమును యీకొలనుండి సంగతి విందము. అని వారు గబగబ కాఫీహోటేలునకుఁబోయి నాలుగుదోసెలు రెండు యిడ్డేనులు ఒకకప్పు కాఫీని దీసికొని మార్గమధ్యమున తమ మిత్రులను కొందరి కీవింతను జెప్పుచు చెఱసాల మార్గాభిముఖులై పోవుచుండిరి.

ఆనూతిలో రక్షకభటుడు పడెనా ? ఖయిదీపడెనా ? వీరిద్దరికును సంబంధమేమి ? వారట్లు కేకలు వేయుటకును యీలవేయుటకును కారణమేమి ? నూతిలో నంతధ్వని వచ్చుటకు హేతువేమి ? ఈ పైప్రశ్నలకు మాచదువరులు జవాబులను యోచించ ప్రార్థితులు. అట్లుగాదేని ముందు ప్రకరణములను జదువుడు.

---

## 3 వ ప్రకరణము

(నిశ్చయము)

సూర్యాస్తమాన మగుచుండెను. విశాఖపట్టణమునం గల యువతీ యువకులు చల్లగాలికొరకు సముద్రతీరమునకుఁబోయి నిసుకతిన్నెలమీఁద నక్కడక్కడ తమ కను వగు తావులం గూర్చుని లోకాభిరామాయణములను జెప్పుకొనువారును దేహారోగ్యము లను ముచ్చటించుకొనువారును సముద్రజలముల స్నానమాడువారును నైయుండిరి. ఒకచోట నిద్దరు యువకులు గూర్చుని యిట్లు ప్రసంగించుకొనుచుండిరి.—

ప్ర—మిత్రమా! యెంతకష్టపడితివి?

ద్వి—భృత్యుని కష్టము గణించవచ్చునా!

ప్ర—కాని యిట్టి దద్వితీయము కాదా!

ద్వి—దానికేమిలెండి. ప్రభుకటాక్షముండవలెను.

ప్ర—విశేషములు తరువాత చెప్పెదనంటివి?

ద్వి—విశేషములు వినదగనివి—విపరీతములు—హృదయభేద్యములు—అబ్బబ్బ—ఘోరము—

ప్ర—అమ్మగారు క్షేమమా?

ద్వి—అట్టి క్షేమమేయున్న మనకిన్నిపాట్లెందుకు?

ప్ర—ఎక్కడ నున్నది?

ద్వి—ఎక్కడ నున్నారని చెప్పగలను.

ప్ర—బంధింపబడినారా?

ద్వి—లేదు.

ప్ర—పాట్నాకు పలాయనమైరా!

ద్వి—అబ్బా! పాట్నా కలకత్తాల నామములు చెప్పకు. కర్ణభేద్యములు.

ప్ర—చిత్రాడలో నుండిరా?

ద్వి—నీ చిత్రాడకాల, దాని నామము తలపెట్టకు.

ప్ర—ఎందుచేత? కారణము చెప్పుము.

ద్వి—నోరాడదు.

ప్ర—అమ్మను మట్టుబెట్టిరా?

ద్వి—లేదు. ముమ్మాటికిని లేదు. [illegible] పెట్టగలరా!

ప్ర—మరేమి సంభవించెను?

ద్వి—స్వచ్ఛందమరణముచే నసువులం బాసెను.

ప్ర—హా! తల్లీ; వీరమాతా! మమ్ము తల్లిలేని పిల్లలం జేసి పోతివా? తల్లిదండ్రాదుల నెరుగక నిన్నే తల్లిగ భావించు [illegible]డుములు గుమపనెంచితివా? నిన్నే క్రూరు లంతగా బాధపెట్టిరి?

ద్వి—మిత్రమా! విచారించిన లాభమేమి? మరణకారణమును వాకబు చేసితిని.

ప్ర—వ్యాధిచే మరణించినదా?

ద్వి—లేదుతండ్రీ—

ప్ర—భర్తవియోగ కారణముననా?

ద్వి—అదియుగాదు. పత్తేదారుడు సుందర్రావు మూలమున.

ప్ర—అయ్యో! వాడు దురాత్ముడు, క్రూరుడు, జిత్తులమారి.

ద్వి—అమ్మ మరణాంతరమున నుత్తరహిందూదేశమునకు బదిలీచేసిరి.

ప్ర—ఎందుచేతనో?

ద్వి—సర్కారును, స్నేహితుని బట్టుటకు—

ప్ర—సర్కారు చెరవిముక్తికి కారణము?

ద్వి—కరీంసీబాబు.

ప్ర—ఎట్లు?

ద్వి—చెరసాల క్రిందనుండి యొక సొరంగమును సర్కార్ గదిక్రిందకు త్రవ్వి తద్వారా దీసికొనిపోయెను.

ప్ర—బాగుబాగు అతిసాహసము. స్వామికార్యధురంధరుల కెందును జంకులేదు గదా?

ద్వి—తిరిగి పత్తేదారుండు ప్రయత్నములమీద సర్కారును* సిలిగురియింట బంధించి నంతి - 1 *

ప్ర—ఆరే! బాబే పట్టుపడెనా? వింత—

ద్వి—అంత సర్కారు తనవద్దనున్న తుపాకితో గాల్చుకొని స్వర్గస్థుడాయెను.

ప్ర—హా! తండ్రీ! ప్రతాపసర్కార్! హా! దుర్గాసర్కార్ మనుష్యుల తల్లిదండ్రులులేని బిడ్డలనుజేసి పోతిరా? పుత్రుడాశతో నున్న మదియాశలన్నియు నడుగంటినవి. మిత్రమా! మన మెవరికొఱకు జీవించవలెను. మూడవ చుట్టమును క్రొంక్ర-దైవమును లేరుగదా?

ద్వి—బాబు! అట్లుకాదు. నిరుత్సాహమును బొందగూడదు. విచారమును విసర్జించవలెను. ధైర్యలక్ష్మిని ప్రార్థించవలెను. భార్యయు వచ్చును. పిల్లలును గలుగుదురు. కుటుంబము వృద్ధియగును. పోయినవారికొఱకు కొంతవరకు విచారించవచ్చునే గాని, వారి ననుసరించి చచ్చుటెంతమాత్రము తగని పని. నీవలెనే ప్రతిమనుజుడును చేసిన ప్రపంచక మెందును? నీవలెనే నేనును ప్రాణములపై నాశను వదలిన యెడల నీ చెరవిముక్తి యగుటెట్లు? కాబట్టి మనమింక క్రొత్తనాటకమును ప్రదర్శింతము. నీవును అసమానధురంధరుండవు.

ప్ర—అవునుగాని, దుర్గాప్రతాపులను పట్టి పల్లార్చిన పత్తేదారుండుండగ మన నాటకము కొనసాగునా?

ద్వి—అది వేరేసంగతి. జయాపజయంబులు దైవాధీనములని పెద్దలు చెప్పుదురు.

* 1 (ప్రతాపదౌర్జన్యమును రెండవభాగమును జదువుడు.)

కోటిలో తలదూర్చి కోకటిపోటునకు వెఱచువారుందురా ? అయినను ఆపత్తేదారుడు ప్రస్తుతము రెండు సంవత్సరములు సెలవుదీసికొని యున్నాడని వినియుంటిని.

ప్ర—అట్లనా ! అయిన నాలోచింతము.

ద్వి—ఈ రాత్రి మనము టర్నర్ సత్రముకుపోయి సంగతి యాలోచించి ముందుకథ కుపక్రమించుదము.

ప్ర—సరే పద-పోవుదము.

---

## 4 వ ప్రకరణము

---

కుట్ర

ఆ యువకు లిద్దరును టర్నర్ మహాశయుని సత్రమువద్దకుఁ బోయి అక్కడనుండు గుమాస్తాగారితో నొకగది తమ కిప్పించుమని కోరిరిగాని ఆయన గదులు లేవనియు బైట గొబ్బరిచెట్లవద్ద వంటచేసికొని హాలులో పరుండుడనియు నిష్కర్షగా వారితో చెప్పెను. అంత వారిలో నొకడా గుమాస్తాగారితో నిక నా ప్రతివాదమువల్ల కార్యము లేదనియు గది ముఖ్యముగ కావలసియుండుటచేతను, తన జేబులోనుండి యొక రూపాయినిదీసి నాసచేతిలోఁ బెట్టెను. ఆ గుమాస్తాగారికి కొల్లటికోపము యెక్కడికో పోయెను ప్రసన్నకళలు మోమున నలంకరించుచుండెను. "ధనమూలం మిదంజగత్తని" గదా పెద్దల నుడులు. తోడనే ఆమహాశయుఁడిట్లనియె "మీరెన్ని దినములుండెదరు?"

ప్ర—అయ్యా ! రేపు మధ్యాహ్నముబండిమీద పోవుదుము.

గు—అట్లయిన యిచ్చెదను. తాలూకాబోర్డు మెంబరుగారు నొకగది ఖాళీగా నుంచమని నాపేర వ్రాయుటచే నొకదానికి తాళముకొని ఆయనకొరకు సిద్ధముగా నుంచితిని. ఆయన రేపు మధ్యాహ్నము బండిమీద వచ్చెదరు. అప్పటికి మీరు ఖాళీ చేయగలరా ?

ప్ర—తప్పక చేయుదము.

గు—లేకపోయిన నాకు మాటవచ్చును సుమా !

ప్ర—ఎంతమాట ? మీకు మాట దెప్పింతుమా ? ఇట్లు తన నిర్దోషత్వమును వెల్లడించునట్లును వారి కుపకారార్థ మొనరించునట్లును ప్రవర్తించి, లోనికిపోయి తాళముచెవు లను దెచ్చి నం 4 రు గదిని సమీపించి తాళమును దెఱచిపోయెను. అంత మనయువకులు కడు సంతసించుచు నా గదిలో ప్రవేశించిరి. కొంతసేపటి నొకరితో నొకరు ప్రసంగించుచుండిరి. తరువాత వారిట్లు ప్రసంగించ మొదలిడిరి :—

ప్ర—ముందు కథమి ? సూత్రధారుని పాత్ర యంగీకరించెదవా ?

ద్వి—ముఖ్యముగా నట్లేగాని మనమిద్దరమును కడు జాగరూకతతో మెలంగవలెను. లేనియెడల ప్రమాదము తప్పదు.

ప్ర—అనగా ?

ద్వి—నామరూపములను క్షణ క్షణములో మార్చి కాలానుకూలముగ ప్రవర్తింప వలెను.

ప్ర—అట్లే చేయువచ్చును. మీవు వెనుక అమ్మగారి జట్టులో పనిచేసినవారు వస్తారని చెప్పితివిగావా !

ద్వి—అవును వారువచ్చి చాల దినములయినది. నాయొరికనే యీ సత్రములోనే యుండిరి. మనము చెరనుండి వచ్చిన తర్వాత జరిగిన విశేషముల నారసి రండని నియోగించితిని. వారును క్షణములోనే వత్తురు. వారును మనమును గలసి, యీ రోజుననే ప్రయత్నించి ద్రవ్యాన్వేషణము చేయవలసియున్నది. లేనియెడల మనులేమియు సాగవు.

ప్ర—ముఖ్యముగా చేయుందము—అనువగుచోటును దిలకించితిరా ?

ద్వి—ఆ చూచియే యుంచినాను.

ప్ర—ఎక్కడ ?

ద్వి—ఈ వూరిలోనే ఇల్లు చూపెదను. శ్రమయెక్కువ. మనవాళ్ళు ప్రయత్నము చేసిరిగాని లభించలేదు.

ప్ర—అంత ప్రయాసైనదా ?

ద్వి—అదొక చిన్న మండువాలోగిలి. దానికి నలుతట్లను గొప్ప ప్రహారీగోడ యున్నది. పాణిద్వారము తప్ప మరితర ద్వారములు లేవు. ఇంటనొక మగవాడును, వారి భార్యయు ముసలిది తల్లియు తప్ప మరెవ్వరును లేరు.

ప్ర—ద్రవ్యమెం ?

ద్వి—సుమారు లక్షవరకు వుండునను వాడుక. అదంతయు ముసలిది పడుండు గదిలో వుండును.

ప్ర—అట్లయిన నేనేబోయెదను. నాకు నలుగురు బలిష్ఠులను సహాయమిమ్ము.

ద్వి—అట్లే.

ప్ర—ప్రహారీగోడ యెత్తుఎంత ?

ద్వి—సుమారు 9 అడుగులు.

ప్ర—గోడకుమధ్య వరంజాగూడు లున్నవా ?

ద్వి—లేవు లేవు-అంతయు సున్నముతోను రాయితోను కట్టబడినది. గోడలోపల దొడ్డిలో సుమారు రెండు నిలువుల కందకము త్రవ్వబడియున్నది. ఆప్రయత్నము చేయవద్దు. చేసినను కార్యములేదు.

ప్ర—సరే-తెలిసినది—

ద్వి—నేను బైట వుండెదను.

ప్ర—మంచిది. నేను లోపలికివెళ్ళి తలుపులను దీయుదును. అంతమీరు లోనికివచ్చి కార్యమును జేయువచ్చును.

ద్వి—లోపల ప్రమాదము సుమా !

ప్ర—ఇట్టిది క్రొత్తలా, ప్రమాదమే వచ్చినయెడల కూనీలు జరుగవా ?

ద్వి—అవును. మీచాకచక్యము నేర్పు * నాడు దుర్గమ్మగారిని విడిపించుటలోనే తెలిసింది.

ప్ర—మనకు పిత్రార్జితమగు చర స్థిరాస్తులేమైనను లేక పోయినను, జార, చోర, హత్యలు నుగ్గుపాలలో రంగరించి, పోసి, జీర్ణింపజేసినపిమ్మట దుర్గాప్రతాపులు దూరమైపోయినారు. కాబట్టి మనకెందును కొరతరాయేదేము. నీకాపచారమక్కరలేదు.

ద్వి—అవునవును. మరచితిని సరే పద.

ప్ర—మనవాళ్ళు వచ్చుదురంటివి గావా?

ద్వి—అవును. "వచ్చువేళ కావచ్చినది." అనునంతలో నొక యువకుడు వారి ముందునిలచి, చేతులుజోడించి ద్వారమున పొంచికానియుండి తగు సమయమునకై వేచియుండెను. అంత వారిలో ద్వితీయు డిట్లనియె.

ద్వి—ఏమి జరిగినది?

సే—ఉద్యోగస్థులందరు తండోపతండములుగ మోటారుల మీదను, బండ్లలోను, సైకిళ్ళమీదను వచ్చి అంతయు పరీక్షచేసిరి.

ద్వి—పత్తేదారుడో?

సే—వాడు వచ్చినను, రాకపోయినను యొకటే.

ద్వి—ఎందుచేత?

సే—కత్తియు, తుపాకియు మొదలగునవి నూతివద్ద నున్నపుడు ఆదొంగ మన రక్షక భటునితో తగవులాడి నూతిలో వానినిద్రోసి, తానెక్కడికో పోయెననియు, రక్షక భటుని కళేబరము నూతిలో తప్పకదొరుకుననియు, వాదించెను. జిల్లాఅధికారి మొదలగు వారట్లుగాదనియు. తప్పక భ్రమ గొల్పుట కట్లు చేసినపనిగాని వ్యతిరేకముగాదనియు వాదించిరి. అయినను నూతిలో తమ యావచ్ఛక్తిని వినియోగించి, వెదకిరిగాని కార్యము లేకపోయెను. ఆనూతిలో నొక గొప్ప రాయితప్ప నితరము లేమియు గనుపించలేదు.

ద్వి—తరువాత?

సే—అంతనాజిల్లాయధికారికి శ్రమవల్లను పాతఖైదీపలాయన మగుటచేతను, పత్తేదారుని యూహలు శ్రేష్ఠములుగా నుండకపోవుటచే యీకేసును బట్టుటసాధ్యమని యోచించి, నాపత్తేదారుని దూషించి, వానినెక్కడికో బదిలీచేయుమని తన తాబేదారుల కుత్తరువిచ్చి ఆ పారిపోయిన వాడును రక్షకభటుడును దగ్గరవారగుటచేతి నంతప్రమాదము సంభవించిన దని యోచించి, చిత్రాడ రాజమండ్రి మొదలగు గ్రామములలో చక్రవర్తి పలాయనమైనసంగతి నాగ్రామోద్యోగస్థులకును వారి పైఅధికారులకును తెలియపర్చమనియు, యీ బస్తీలో ప్రతివీధిని చాటించమనియు ఆజ్ఞాపించెను.

ద్వి—బాగున్నది. కొద్దిరోజులలో వారికి తగునట్లు బుద్ధిచెప్పుదాము. భోజనమునకు పోవుదము. లెండు లెండు. వేళ యతిక్రమించుచున్నది. అని వారండరు నాగదికి తాళముచేవి యొక్కడికోపోయిరి.

---

*భయంకరనారీపిశాచిలో "సారిపంచి" పెట్టుటను చదువుడు.

రాములను జతయిచ్చి పంపినాను.

సూ—ఇది బహుచిత్రముగానున్నది. ఇందు చాల మోసము గలదు. సేవకుని యొకనిని బిలచి "నా యాజ్ఞగా క్రొత్త పత్తేదారుని రమ్మనమని వర్తమానింపుము." అని చెప్పుటతోడనే బట్లరంత నొకనిని నీ యజమానుని యాజ్ఞను జెప్పి తత్క్షణమును క్రొత్త పత్తేదారుని దీసుకొని రమ్మనమని చెప్పెను. వాడంత వాయువేగముగ బోయి పత్తేదారునితో మనవిచేసెను. పత్తేదారుడును గొప్ప వింతయుండనిదే రత్నకథిటాఢ్యుడు వర్తమానము పంపడని యోచించి తత్క్షణమే తన ద్విచక్రశకటముమీద వాని గృహమునకుం బోయెను. అంత నా యధికారి వానితో సంగతి నామూలాగ్రముగ జెప్పి జాగరూకతతో కానిచ్చుండుమని చెప్పెను. పత్తేదారుడును ఆయన జెప్పినకథతో తృప్తిం బొందక నా బట్లరును పరీక్షించ మొదలిడెను.

పత్తే—వాడిక్కడకు ఎన్నిగంటలకొచ్చెను ?

బట్ల—తొమ్మిది గంటలకండి.

ప—వారితో గూడ నెవరున్నారు ?

బ—ఎవ్వరును లేరు.

ప—వాని యాకారమును జూచితివా ?

బ—ఆ! చూచినానండి. వాడంత పొడవుగా లేడు కాని నించుక స్థూలముగా మాత్రము గన్పట్టెను.

ప—ఎట్టి దుస్తులను ధరించెను ?

బ—నిక్కరు (లాగు) సుదోట్టు నొక్కా కోటును ఈ దుస్తులన్నియు కాకిరంగు గుడ్డలే.

ప—వాని మేని ఛాయ ?

బ—చీకటిలో నుండుటచేత నంతగా పరీక్షించలేదు.

ప—సజ్జనుగారి కారుడ్రైవరును (Driver) యిదివరకు నీవెరుగుదువా !

బ—చిత్తము యెరుగుదునండి.

ప—అట్లయిన నీవు యీ క్రొత్తవానికి కారెట్లిచ్చితివి !

బ—నేనును ఆ ప్రశ్నయే వేసితిని. అంతవాడు తాను ఆయన కొలువులో నిన్ననే ప్రవేశించితిననియు, పాతడ్రైవరు (Driver) రాజీనామాయిచ్చి పోయినాడనియు చెప్పెను.

ప—అంతమాత్రమున వానినమ్మి వానికి కారు నిచ్చితివా ?

బ—లేదండి నాకును నమ్మకము లేకనే కారుతో మా బంట్రోతు రాములను యిచ్చి పంపితిని.

ప—బాగు నీవు సరిగానే చేసితివి. ముందు సంగతి విచారింతము.

అని పోలీసు సూపరింటెండెంటుగారివద్ద శలవుందీసికొని గృహోన్ముఖుడై పోవుచుండెను. అంత కుక్కుటంబులు కొక్కుర్కో యని కూయ మొదలిడెను. కాకులు కావు

ఆ మూడుశవముల కంఠములకు వేరు వేరు ధారములతో నొక్కొక్క కాగితపుముక్కను గట్టబడియుండెను. పత్తేదారుడు వానిని యూడదీసి తనలోతాను జదివికొనుచుండెను.

## 6 వ ప్రకరణము

### లేఖల వృత్తాంతము

పత్తేదారు డటుజదివికొనులేఖలమీద నాయధికారుల దృష్టులుపడెను. అంత జిల్లాధికారి వానితో "ఏమండి! లేఖలలో సంగతులేమి? అవి మరణశాసనములా?" అని ప్రశ్నించెను. పత్తేదారు డొకింతచిరునవ్వుతో "కావండి విచిత్రలేఖలు—మీరు వినదగినవే—శలవైన చదివి వినిపింతును" అనెను. అంత నాయధికారి వానిని జదువుట కుత్తరవిచ్చెను. పత్తేదారుడీ క్రిందివిధముగఁ జదువనారంభించెను.

(1) మొదటిలేఖ వృత్తాంతము.

ఈతను పోలీసుసూపరింటెండెంటుగారి బంట్రోతు. ఈతను తన యజమానుని ఆజ్ఞప్రకారము కారుతో వచ్చెను. కారు నాదిగాదు. పోలీసుసూపరింటెండెంటుగారి దని మీకు తెలిసియేయున్నది. వీడు నిరపరాధుడే గాని నాయాజ్ఞను దిరస్కరించుటచే నిట్లు మృతుడయ్యెను. ఎట్లన నేను యీతనిని మరల యింటికిపొమ్మనియు నాతో రావద్దనియు జెప్పితిని. వాడందుల కొప్పుకొనలేదు. నేను వానికి నానావిధబోధనముల బోధించి వెయ్యిరూపాయిల నిచ్చెదననియు కూడ నచ్చజెప్పితిని. అది వానికి రుచించ లేదు. మీదుమిక్కిలి నాయుద్యమమున కంతరాయము గలిగింతుననియు, తన యధికారులతో జెప్పి నన్ను బంధించి నాశపకారము చేయుదుననియు నాతో వాగ్వాదము చాలదూరముచేసి నన్ను భయపెట్టదలంచికొనెను. నేను మిక్కిలి శాంతముగా వాని యార్భటమును దిలకించి జవాబుచెప్పితిని. వాడు తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళని జెప్పుచుండెను. అంత నేజేయున దేమియు గనుపించని కారణమునను నాప్రాణముల కన్న యితరులప్రాణములంత దీపికాకపోవుటచేతను వీనిని వధించితిని. వీడుసమానా దురంధరుడు. స్వామికార్యాదురంధరుడు. నీతిశాలి. ధనాశామారుడు. అయినను విధికృతమున కడ్డులేదుగదా?

మకాం
టర్నర్ సత్రవున
నెం 4 రు గది

ఇట్లు,
భయంకర చోరాగ్రేసరచక్రవర్తి.

(2) రెండవలేఖ వృత్తాంతము.

ఈతని యిల్లు విశాఖపట్టణము స్టేషను వద్ద వెపావారి వీధిలో ఎడమ వైపున 4 వ యిల్లు. ఈతని పేరు గంపా పాపయ్య. ఇతను బహువ్యాపారి. ధనికుడు. నేను నా మిత్రునితో నిన్న పగలు పది గంటలకు వీనియొద్దకుఁబోయి నూకొక వెయ్యిరూపాయ

ననుచుడుకీయమనియు త్వరలో అనగా నెలకో జూలో యసలీఫాయిదాలతోఁ దెచ్చి యిత్తుమనియు మొదలైన మా స్థితిగతులను నచ్చచెప్పగా యితడు మొదట యిచ్చెద నని వాగ్దానముచేసి వడ్డీవిషయమై మాతో బేరమాడుచుండెను. మొదట నూటికి రూపాయి అనియు రూపాయిపావలా అనియు, రెండురూపాయిలనియు చెప్పు చుండగా వీనితల్లి లోనుండి చఱ్ఱునవచ్చి సంగతారసి మూడురూపాయిలైతేనేగాని వల్ల గాదని తన కుమారునకుజెప్పి లోనికి పోయెను. అంత కుమారుడు మాతో నట్లేచెప్పెను. నేను "అయ్యా! యీ దురన్యాయము తగునా? అన్నదొకమాట. ఆడినదొకమాట. మీరు వ్యవహారతలు. నాబోటిపేదవాండ్రనుహింసించిన మేకేమిలాభము. దైవములేడా? కానిండు అనిచెప్పితిని. అంతనాతడు నామీదను నామిత్రునిమీదను కాలాగ్నిరుద్రునిలాగునమండి పడుచు, అనరాని దుర్భాషలాడి, మమ్ములను చిన్నబుచ్చి, మేమడిగిన సొమ్ము నివ్వ నొల్లకుండెను. అంత లోనుండి నా ముసలిదివచ్చి మాకు చేయరాని న్యూనతను జేసిన తోడనే నేనును నాతనిని యెదిరించితిని. వా డంత నామీద కురికి నన్ను చంపెద ననియు, నా తల్లిని భార్యను మొదలగువాళ్ళనుగూడ దిట్టి, యిట్లనియె. "నిన్ను చంపి నీ భార్యను చరపట్టి, నిన్ను మూడుకోర్టులను తిప్పి ఏడిపించెదను." అని శపథ మొన ర్చెను. నాకును కోపమెచ్చి, నచిరకాలములోనే నేను నీవుచేసిన శపథమును నెరవేర్చె దను. అట్లు చేయలేనియెడల "నీ సన్నిధానముననే నా ప్రాణములను బాపెదను." అని నలుగురి సన్నిధానమందే ప్రతిజ్ఞచేసితిని. అట్టి ప్రతిజ్ఞను నెరవేర్చితిని.

మకాం<br>టర్నర్ సత్రవున<br>కెం 4 రు గది

ఇట్లు,<br>భయంకర చోరాగ్రేసర చక్రవర్తి.

## (3) మూడవలేఖ వృత్తాంతము.

ఈ ముసలిముండ వృత్తాంత మిదివరకే కొంత రెండవలేఖయందు చెప్పియుం టిని. దీనికి 70 సంవత్సరములు ప్రాయమైనప్పటికిని నించుకేని దానధర్మములులేక మర్యాదామర్యాదలులేక, సర్వమును ధనముతోనే వున్నదనియు, ధనమే మోక్షసాధన మనియు, ధనమే యిహపరసౌఖ్యములనియు, యెంచి, దానిని బహుగుప్తపరచినయెడల చాల మంచిదనియు కొడుకునకు బోధించి, వడ్డీకి నినుమణుంగుల వడ్డీని గట్టమనుచు, వారి కొంపలు, వీరికొంపలు, దీయమనుచు దురోభ్ధనలను సమయానుకూలముగ జెప్పు చుండెను. ఇంట మలమల మాడుచున్నను, కోడలకును దీనికిని మారువస్త్రము లేకపో యినను, మంచి చెడ్డలకు చుట్టపక్కములు రాకపోయినను, ధనము—ధనము—వడ్డీలకు వడ్డీలతో పెట్టెలలోనికి చేరితే చాలు. అనాడు నేనును తన కొడుకును తగవులాడు చుండ యింటనుండి, తోంబిరియేండ్ల తొక్కుముర్య, గబ గబ వచ్చి, కేకలు వేయు చున్న నన్ను గని కోపోద్రేకముతో చేతనున్న కర్రను నామీదికి విసరి, చెంబెడు పేడనీళ్ళు నా మొగముపై బోసినది. ఈ న్యూనతకు నేను చాల వగచి, నట్టి తరుణ మున నే జేయునదిలేక యిట్లంటిని. "ఓసీ! గయ్యాళి! నీ పాపము నేటితో పండిన దని యెంచుము. నిరపరాధుడనైన నన్నే యిట్లు శిక్షించితివి. యిక యపరాధు ల

నెట్లు దండింతువో గదా! నిన్నిక భూమిపై యెంతమాత్రమును బ్రతుకనివ్వగూడదు. అట్లుచేసితినేని భూదేవికెంతయు హానిచేసినవాడ నగుదును. తప్పక యీపాపఫల మచిర కాలములోనే యనుభవింతువు. పో- పో-" అంత నదియు ననరాని పరుషములు పలికి యిరుగుపొరుగువారిని పిలిచి సాక్ష్యముండుడని కోరినను వారది మామూలేయని భావించి యెవ్వరును మాట్లాడరైరి. వెంటనే ఆమెకు కోపము మరింత హెచ్చి గుమ్మము దిగి నామీదకు రా నుద్యమించు సమయమున లోనుండి కోడలువచ్చి, నామీద నుమిసి తనయత్తగారిని గొట్టి చంపుదునేమో యని గొల్లున క్రిందబడి యేడ్చెను. నే నంత నామెవైపునకు దిరిగి తల పంకించి నేదియో మనోనిశ్చయము జేసికొని, యక్కడ నుండి నామిత్రునితో వెడలిపోతిని.

మకాం
టర్నర్ సత్రపున
నెం 4 రు గది.

ఇట్లు,
భయంకర చోరాగ్రేసరచక్రవర్తి.

అంత నాయధికారులు ఆశ్చర్యనిమగ్నులై కొంతవడి నొకరితోనొకరు మాట్లాడ లేకపోయిరి. కేసు స్వభావమును నా డామూలాగ్రముగ దెలియపర్చ ననువారును, వాని మనోధైర్యములకు మెచ్చువారును, ఆ నిపుణ ప్రశ్నలకు వెరగందువారును నైయుండిరి. ఎట్టకేలకు వారిట్లు మాటాడదొడంగిరి.

జి-అ—ఏమండీ! మా కిప్పుడు దొంగకొంపవద్దకు పోవుదమా?

సూ—"అయితే యింకను యీతస్కరాగ్రణి జీవించియుండెనట్లు దోచుచున్నది.

ప—అవును. అట్లే మనము తప్పక గృహమునకు బోవలసియున్నది.

జి-అ—నెం 4 రు గదిలో ఫీడి మకాం అని వ్రాయుటెందులకో?

ప—మనలను మోసపుచ్చుటకు.

సూ—కాదుకాదు. అది నిశ్చయమనియే దోచుచున్నది.

ప—కావచ్చునుగాని ప్రస్తుత మక్కడుండుటకు వానికినుండె ధైర్యము చాలునా?

సూ—అయితే కర్తవ్యము?

ప—తప్పక మనమందరమును వారియింటికిబోయి పరిశీలించుటే కర్తవ్యము.

జి-అ—బాగున్నది. ఆలస్యమెందుకు?

సూ—శవముల మాట?

ప—వీనిగూడ కారుసహాయమున అక్కడకే దీసికొనిపోవలెను. వాని నక్కడుంచు టెందులకు. గృహపరిశోధనానంతరము పంచాయితీ తీర్మానముప్రకారము చేయుదము.

సూ—అవును. అట్లే చేయుదము.

అని వారందరును కలసి యాశవములతో, రెండవలేఖలో చెప్పినప్రకారము నాగృహమునకుబోయి, వీధిలో కారుల నాపి, వారందరును లోనికి పోవుచుండిరి. ఆయింటస్త్రీయొక్క విచారమును విన నలవిగాకుండెను. అందరికిని విచారము మెండయ్యెను. అగృహము, గృహముగాదు. ఇంచుమించుగా యమగృహమును బోలియున్నది. రక్తము-మాంసము-దుఃఖము-అబ్బబ్బా! రామ! రామ! ఘోరముకేము.

## 7 వ ప్రకరణము

---

### పరిశోధన

చాలసేపు వారట్లు విచారనిమగ్నులై నొకరితో నొకరు మాట్లాడ లేకపోయిరి. ఎంతసేప ట్లూరకున్నను ఆమె దుఃఖమునకు మేరలేదనియు, ప్రొద్దుపోవుచున్నదనియు నూహించి నెట్టకేల కా పత్తేదారు డిల్లంతయు పరిశోధించి నావిచారించు పిల్లతో నిట్లు ప్రస్తావించ మొదలిడెను.

ప—అమ్మాయి! నీవు యెన్నిరోజులు యెంత విచారించినను కార్య మేమిగలదు? అంతయు భగవదేచ్ఛ యని గుండె రాయిచేసికోవలెను.

స్త్రీ—తండ్రులారా! రాత్రి భోజనముచేసి కులాసాగ పరున్న మాకెన్ని పాట్లు వచ్చెనో దిలకించితిరా!

ప—అవును. భగవంతుని కృప యట్లున్న ఎవరేమి చేయగలరు? అమ్మా! నీకు తల్లిదండ్రాదులు గలరా!

స్త్రీ—లేరు నాయనా! నే నేకాకిని. నా పినతండ్రి కొడుకు మాత్రము గలడు.

ప—ఎక్కడ?

స్త్రీ—గోదావరిజిల్లా—కొత్తపల్లిలో.

పత్తే—అయితే వానికి తంతి నిత్తునా?

స్త్రీ—చిత్తము.

పత్తే—అమ్మాయి! నీ కెవ్వరిమీదనైనా అనుమానము గలదా?

స్త్రీ—నిన్న ఎవరోవచ్చి నాభర్తను బాకీలిమ్మనమని కోరగా ఆయన యిచ్చెదనని వాగ్దానము చేసెను. కాని వారికిని వీరికిని వడ్డీలో తేడావచ్చుటతోడనే గరషణ యెక్కువైనది. క్రమక్రమమున వృద్ధియై శపథములమీదుగా నిట్లు పరిణమించెను.

ప—అయితే వానిని నీవెరుగుదువా?

స్త్రీ—ఎరుగను. వానిని పోల్చగలను.

ప—రాత్రి వా డెట్లీ గృహమును ప్రవేశించెను?

స్త్రీ—తెలియదు. కన్నమునకు స్వాధీనముకాని కొంపండి.

ప—రాత్రి మీ రెక్కడ పరుంటిరి?

స్త్రీ—నేనీగదిలో యించుకదేహమస్వస్థతగానుండుటచేత పరుండితిని. నానాథుడు బైట యీగుమ్మమువద్దనే మంచముమీద పరుండెను. నాఅత్తగారు మామూలుగ నా మొగదిలోనే పరుండెను. నేను తెల్లవారిన తర్వాత సూర్యకిరణములు నాగదిలోనికి వచ్చుటచే తెల్లవారినదనియు పనులు చేసికొనవలెననియు యెంచి, ద్వారములను తెరువ బోగా నవి పైన బంధింపబడుటచే రాలేదు. అంత నా భర్తను, అత్తగారిని పిలిచితిని, గాని ప్రత్యుత్తరము రాలేదు. తోడనే నామనస్సున భయాందోళన మంకురించుటచేత, నిన్న తగువులాట జ్ఞప్తికి వచ్చి, పెద్దగొంతుకతో కేకలు పెట్టితిని. నా కేకలు విపరీతము

అగుటచే నన్నెవరో నిర్బంధము చేయుచున్నట్లు గ్రహించి సతిత్వరితముగ దారిబోవు వారు జనుదెంచిః దలుపును దీసిరి. నేను బైటకొచ్చుసరికి నెత్తురు కాలువలు గట్టుట చేతను మావారు గనుపించకపోవుటచేతను మూర్ఛిల్లితిని. ఇదియే నాసంగతి. తమ రీ దీనురాలిపై కరుణవహించి రక్షించు బాధ్యతను వహింప గోరుచున్నదానను.

ఈ సంగతి విన్న యధికారు లాశ్చర్యవిషాదములు చెప్పతరముగాదు. వారు చూచిన లేఖల వృత్తాంతములకును యీమె చెప్పిన కథకును సరిపోవుటచేత వారి ఆలోచనల కంతులేదు. దొంగెట్లు ప్రవేశించినదియు వారింకను గ్రహించలేకపోయిరి. కొంతసేపటి నాపత్తేదారుడు తల పైకెత్తి యోచించుచుండెను. తోడనే తల పంకించి, మొగమును క్రిందికిదింపి నాస్త్రీతో నిట్లనియె—

ప—అమ్మాయి ! నీపేరేమి ?

స్త్రీ—నాపేరు కమల—

ప—కమలా. యీమండువాకుపైన యింటిమీద ఆచూరునకును యీచూరునకును వేసిన కాడిని (Yoke) యెవరు వేసిరి ?

స్త్రీ—నాకు తెలియదండి. రాత్రివరకు దానిసంగతి మాకు దెలియదు.

ప—సరే. అని నొక రక్షకభటుని జీరి యాకాడిని (Yoke) దీయుమని యుత్తరు విచ్చుటతోడనే నది క్షణములో క్రిందికిఁ దీయబడెను. ఆకాడి కిరుప్రక్కల రంధ్రము లుండెను. దానిని నాపత్తేదారుడు చేతపట్టుకొని పరిశోధించుచుండెను. వాని కొక రంధ్రములో నొక చిన్న కాగితము మడతగపడెను. ఆయన దానిని బైటకిఁదీసి బిగ్గరగా నిట్లుఁ జదువ నారంభించెను.

ప్రియమైన సుందరరావు పంతులుగార్కి,

నీవు దుర్గా ప్రతాపులనుబట్టి బంధించుటచేతను నన్ను మున్నొకసారి మోసగించుటచేతను నిన్ను పాపమీయధికారు లిక్కడకు బదిలీచేసినారు. నేను దాదామూల మున చరవిముక్తుడ నైతినని నీకుఁ దెలిసియేయున్నది. * దాదా సామర్థ్యము నాచేర్పు నీకుఁ దెలియనివిగావు. అయినను నేను దుర్గాప్రతాపులవలెగాక నీకు నా ముందుసంగతులు (Programme) తెలిపియే చేసెదను. కాబట్టి నీవింతమాత్రమును శ్రమనొందకుండగనే కార్యము నెరవేర్చుకొని బిరుదములు సంపాదించి మెడలో వేసికొనవచ్చును. లేదా నీవు చేతికి దొరకితివా పుత్రమిత్ర కళత్ర బాంధవులతో నశించిపట్లుగనే యెంచుము. కాబట్టి యీ కార్యమును నీ భుజస్కంధమున బెట్టికొన నెంచితివో లేక నాకు జోహారు జేసెదవో తెలియపర్చుము.

మకాం
టర్నర్ సత్రవున *
నెం 4 రు గది

ఇట్లు,
భయంకర చోరాగ్రేసరచక్రవర్తి.

సు—ఇదిచాల చిత్రముగనున్నదే ? మీరు వీనిని యెరుగుదురా ?

ప—అయ్యో ! ఎరుగకేమండి ? నాకు చిరపరిచితుడు. శత్రుశేషముంచగూడదన్న

---

* భయంకర నారీపిశాచి చూడుడు.

పెద్దలవాక్యము లనృతములుగావు.

జి-అ—అవును ముందు కథేమి?

సూ—సత్రవునకుఁబోయి వానిని బంధించిన బాగుండదా!

ప—కాని వాడంత సులాయాసముగ చిక్కునా? మనము తొందరపడి సత్రవునకు వత్తుమనియు, మనలనుజూచి తెలివితక్కువ వాళ్ళుగా భావించి ముందుకూడ మనలను తప్పుత్రోవలలోబెట్టి తన నిరంకుశాధికారము చెలాయించుటకు జేసిన యెత్తుగావి మరి యొకటిగాదు.

సూ—అవును అదియు యోచనీయమే. ఎట్లయినను కార్యమును నీభుజస్కంధమును బెట్టికొని సాధించవలెనుగాని వేరుగాదుగదా?

ప—చిత్తము. భగవదనుగ్రహమును మీసహాయమును వుండినయెడల కార్యమెట్లయినను సాధించగలననియేఁ దోచుచున్నది.

జి-అ—మంచిది. మాసహాయమున కేమియు లోటురాదు. ముందు కథేమి?

పత్తే—శవములను దహనక్రియల కుత్తరువియ్యవలెను. లేనియెడ అవి పాడైపోవును.

సూ—అవును. దాని కభ్యంతరమేమి?

పత్తే—ఈ కమల యభిప్రాయమును దెలిసికొనిన పిదప మనము చేయవలసిన పని చేయుదము. "అమ్మాయి! కమల! ఈ శవములను దహనముచేయవలసియున్నది! నీవు స్త్రీవి, ఏకాకివి, కాబట్టి ఆ క్రియలను మేమే చేయించెదము. నీ సమ్మతమెట్లో చెప్పకోరెదను."

కమల హృదయమునగల విచార మెవరు వర్ణించగలరు? నోట మాటరాలేదు. కండ్లవెంబడి నీరు కాలువలు కట్టుచుండెను. ఆ మాట వినినతోడనే నొక్కుమ్మడి భూమిపై వ్రాలెను. చుట్టుపక్కలవారామెను లేవదీసి యోదార్చి, ధైర్యము జెప్పుచుండిరి. ఆమె యొకమారు కడసారి భర్తపాదములను జూడకోరెను. అక్కడనుండు వారు ఆ శవములను జూచిన నామెకూడ మరణించునేమో యను భయముతో మొదట ఆమె కోరికను నిరాకరించినను, తరువాత సమ్మతించి ఆ మృతకళేబరమువద్దకుఁ దీసికొని పోయినంతనే, ఆమె దానిమీద వ్రాలి పలువిధముల విలపించదొడంగెను. అబ్బ ఆ దుఃఖము—ఆపరితాపము—ఆవియోగము వర్ణించనలవిగాదు. ఇట్టి దుఃఖములు గలుగజేసిన దుర్మార్గుల కా శ్రీహరి యేమిశిక్ష విధించునో తెలియదు.

---

## 8 వ ప్రకరణము.

### ఉయ్యాలలో పిల్ల మాయమగుట.

శవములను దహనమున కుత్తరువిచ్చి, వానిని సాగనంపుసరికి సుమారు మూడు గంటలయ్యెను. అధికారు లెవ్వరికివి అప్పటివరకు భోజనాదులు లేవనియే చెప్ప వచ్చును. సుందరావుగారు రాత్రి పన్నెండు గంటలకు యింటివద్దనుండి బయలుదేరి

పోలీసు సూపరింటెండెంటుగారియొద్దకుఁ బోయి మరల యింటికిపోవుటకు వీలుచిక్కవదిగాదు. ఆయనకు యింటిసంగతు లేమియు దెలియవు.

ఆయన కొక కుమార్తె గలదనియు, ఆమెను చిన్నతనములో దాదా బెజవాడ కనకదుర్గకు బలిచ్చుటకుఁ దీసికొనిపోవుచుండగా యేలూరులో తనమామగారి యింటనే దాదాను బంధించి కుమార్తెను రక్షించినట్లు "భయంకర నారీపిశాచి"లో వ్రాసియుంటిని గదా! ఆ పిల్లకు వివాహమై భర్తతో కాపురముచేయుచుండెను. దైవానుగ్రహమువల్ల రెండు సంవత్సరముల కామె కొక ఆడపిల్ల జననమయ్యెను. నాటినుండియు ఆమె యారోగ్యస్థితి చెడిపోవుటచే కృశించి నిద్రాహారములు సరిగా రుచించుట లేదు. ఆమె భర్తయు నున్నతోద్యోగములో నుండినందున ననంఖ్యాకులగు ఆంగ్ల ఆంధ్ర భిషగ్వరులను రావించి పరీక్షలు చేయించి తగు చికిత్సలు చేయించెను. గాని నిందుకేని ఆరోగ్యము కలుగలేమికిం జింతించి, స్థలాంతరమునగాని శరీరమారోగ్యము తిన్నబడదని పలువురు పదిమాటలు చెప్పుటచే నామెను తండ్రియొద్దకు బంపెను. ఇటీవల సుందర్రావుగారికి విశాఖపట్టణము బదిలీయయ్యెను. అంత వారితో కుమార్తెను మనుమరాలిని విశాఖపట్టణమునకుఁ దీసికొనివచ్చి, జార్జిసార్వభౌముని చికిత్సాలయములో పరీక్ష చేయించి తగు మందులిప్పించుచుండెను. మందులు సేవవలననో, శీతోష్ణస్థితివలననోగాని నాటినుండియు కొంత యారోగ్యముగనే యుండెను. లేకలేక కలిగిన సంతానమగుటచే నా పిల్లను వారల్లారుముద్దుగాఁ బెంచుచుండిరి. తండ్రియు తన పిల్లలను గురించియు భార్య క్షేమసమాచారమును తరుచు కనుగొనుచునే యుండెను.

“క్షణము మనదిగాదు” అన్న పెద్దలవాక్యము కేవలము సత్యముగాని మరియొకటిగాదు. ఎప్పటి కేదివచ్చునో అది తప్పక వచ్చును. సౌదాగ్రభాగముల సతతము గూర్చున్న పరీక్షిత్తు మొదలగు మహారాజులకేని విధికృతము తప్పలేదని అనుభవజ్ఞులు చెప్పుదురు. అట్టినుడులు కేవలము యదార్థములని వేరెఁ జెప్పనక్కరలేదు.

రాత్రి సుందర్రావుగారు తన కుమార్తెతో గలసి భోజనము జేసి లోకాభిరామాయణములను జెప్పికొని తన ముద్దుల మనుమరాలిని యెత్తి ముద్దాడి పరుండబెట్టునంతలో ఆయన కార్యాంతరమున పోలీసుసూపరింటెండెంటుగారి యింటికిఁబోయెను. పోవునప్పుడు సేవకుని జాగ్రత్తగా పరుండమని ఆజ్ఞాపించెను. ఆయన భార్యయు కుమార్తెయు నా సేవకుని జాగ్రత్తగ నుండుమనియు తాము నిద్రపోవుదుమనియు జెప్పిరి. వాడును బహు జాగరూకతతో నుండువానిలాగున వారికి గన్పట్టుటచే వానిని విశ్వసించి నిద్రపోవుచుండిరి.

ఎట్టివారైనను సేవకులను నమ్మి యజమానులకు హాని తరుచుగా వచ్చుచునే యుండును. ఒక్కొక్కప్పుడు వారికి మానప్రాణహానులుగూడ తటస్థించుననుట కల్లగాదు. సుందర్రావుగారి భార్య లక్ష్మీబాయి వేరొకమంచముమీదను, కుమార్తె మరియొక మంచముమీదను పరుండి చంటిపిల్లను పక్కనేయున్న యుయ్యాలలో పరుండబెట్టి యొడలెరుంగకుండ నిద్రించుచుండిరి. కొంతసేపటికి సుందర్రావుగారి కుమార్తెకు మెలకువవచ్చి సమీపముననేయున్న యుయ్యాలలో పిల్లనందుకొని పాలిచ్చి పరుండ

బెట్టుటకుగాబోలు చేతులుసాచి పిల్ల నందుకొనబోయెను. కాని పిల్లలేదు. అంత నామె నిద్రమత్తుచే, తనతల్లి తీసి పరుండబెట్టుకొన్నదని యోచించి మరల గాఢనిద్రనొందెను. తెల్లవారుఝామున కోడికూతలు, పక్షుల చిటపటధ్వనులు విని లక్ష్మీబాయి మేల్కాంచి లోని కరిగి నిప్పుజేసి, సీసాలోనున్న ఆముదమును కొంచె ముగ్గుగిన్నెలోపోసి, నిప్పు సెగను వెచ్చబెట్టి మనుమరాలికి మామూలుగ ఉగ్గుబెట్టు తలంపుతో ఉయ్యాలవద్దకుం బోయెను, కాని పిల్లమాత్ర మందులేదు. అంత లక్ష్మీబాయి తల్లిపక్కలో నున్నదను కొని వెదకెను. గాని కనుపించలేదు. ఉయ్యాలలో పిల్ల మాయమగుటకు మిక్కలి వెరగందుచు తనకుమార్తెను లేపి యిట్లనియె.

ల—అమ్మాయి! పిల్లేది?

కు—"ఆ, ఆ - ఏమిపిల్ల నీవద్దలేదా?" అని నిశ్చేష్టురాలై మాటలేకుండ యున్నా దినివలె నిటునటు జూచుచొప్ప కదలకుండెను. అంత లక్ష్మీబాయి గదులన్నియు వెదకినదిగాని కనుపించలేదు. సేవకుడును వీధియరుగుమీద పరుండి కుంభకర్ణుని ధిక్కరించునట్లు గుర్రుబెట్టి నిద్రించుచుండెను. లక్ష్మీబాయి యేట్టకేలకు "గొల్లు" మని యేడ్వదొడంగెను. అది చూచి ఆమె కుమార్తెయు దుఃఖింపసాగెను. అంత నిరుగు పొరుగులవారు చుట్టుకేసి సంగతి తెలిసికొని పలువురు పలువిధముల జెప్పికొనసాగిరి. కొందరు సుందర్రావుగారికి ప్రయాణము చేయుమనిరి, ఆయన పట్టణములో నున్నారో లేదో యనువారును, ఎంతచిత్రముగా వుయ్యాలలోని పిల్ల మాయమైనదను వారును రాత్రి కాపలాయుండిన సేవకుని ప్రశ్నించువారును నైయుండిరి. అంత దుఃఖములో వారు వంటలు వగైరాలను జేసికొని భుజింపలేరని యెంచి నిరుగువారు భోజనాదులను తయారుచేసి భుజింపుడని బలవంతము చేసినను వారు భుజింపక దుఃఖ సముద్రములో తల్లి యొక్కమూలను పిల్ల యొక్కమూలను గూర్చుండి యేడ్చుచుండిరి.

ఇంతలో సుందర్రావు బహుప్రయాసపడి స్నానముచేసి భోజనముచేయు తలంపుతో తనగృహమున కేతెంచెను. ఆయనకు తన యింటజరిగిన సంగతేమియు తెలియదు. ఇంట కాలుబెట్టిన తోడనే "గొల్లు" మని తల్లియు భార్యయు నేడ్వసాగిరి. ఎంతధైర్యవంతుడైనను యప్పుడు చాల దిగులొంది స్తంభీభూతుడయ్యె. తనకుమార్తెకు కలిగిన యాపత్తును గ్రహించి, పోయిన ధైర్యమును తిరిగొన్నదై ఆమెను యోదార్చి భార్యకు తన పిల్ల నోదార్చుటకు బదులుగ [illegible] మందలించి భోజనాదులు చేయుమని చెప్పి యిట్లనియె. "పిల్ల [illegible] తప్పక నీ పిల్లను వచ్చి యిచ్చెదను. నీ వన్ని రోజులు [illegible] శరీరమును కృశింపజేసికొనకుము. గోడయుండిన చిత్రముల కేమియగు [illegible] కర్తవ్య మాలోచింతును." అని వచించి భోజనముచేసి జిల్లా [illegible] మునకు బోయెను. అంత సుందర్రావు తొందరగా తనవద్దకు వచ్చుటకు తగిన [illegible] యుండకపోదని గ్రహించి వెలికివచ్చి ఆయనకు స్వాగతమిచ్చి కూర్చుండ నియమించెను. అంత వారీ క్రిందివిధముగా మాట్లాడదొడంగిరి.

జి-అ—ఏమండి! సుందర్రావుగారు యింత తొందరగా వచ్చితిరి?

సు—ఏమి చెప్పను. గతరాత్రినుంచియు నా మనుమరాలు గనబడుటలేదు.

జీ-అ—"ఆయ్యో! మీ మనుమరాలే! ఏమైనది?

సు—ఏమియు నిర్ధారణచేయలేదు. రాత్రి మామూలుగ పరుండబెట్టిరి. నేను రాత్రి పోలీసు సూపరింటెండెంటుగారివద్దకు బోయినప్పుడు చూచితిని. ఇంట సేవకుని పరుండబెట్టియే వెళ్ళితిని.

జీ-అ—ఆ సేవకుని పరిశోధించిరా!

సు—వాడు నేను వచ్చిన తన యుద్యోగమునకు భంగము వచ్చునేమో యని పది గంటలనుండి గనుపించుటలేదు.

జీ-అ—వాడెన్నిరోజులనుంచి మీవద్ద పనిచేయుచుండెను.

సు—నే నిక్కడకు వచ్చినప్పటినుంచియు వాని దీయూరేనట వెనుక పత్తేదారుని యొద్ద పనిచేసినాడట.

జీ-అ—కాని వీడుకూడ వానిజట్టులో వాడేమో? వీనికి తెలియకుండ అంతపని జరుగునా!

సు—నేనును అట్లే యూహించితిని. వాడు ప్రస్తుతము పలాయనమగుటనుబట్టి చూడగా వాడు కేవలము దోషిగానే దోచుచున్నది.

జీ-అ—అది సత్యమే! నిర్దోషికి భయమెందుకు? కాబట్టి వానిని బట్టికొనుటకు తగు ప్రయత్నము చేయుడు. తగిన సహాయము కావలసినయెడల దీసికొనుడు.

సు—చిత్తము. అట్లే చేయుదును. అని వానివద్ద శలవుదీసికొనిపోయెను.

---

## 9 వ ప్రకరణము.

---

### సత్రవులో చంటిబిడ్డ.

భాస్కరుడస్తమించుచుండెను. గాఢాంధకార మెల్లయెడల గ్రమ్ముకొనుచుండెను. వ్యాయామ క్రీడలకుఁబోయిన విద్యార్థులు తమ తమ బసలకుఁ బోవుచుండిరి. శీతలవాయువుకొరకు బోయిన నాబాలవృద్ధులందరు సముద్రతీరమునుండి గృహములకుఁ బోవుచుండిరి. రాజబాటలప్రక్కలనుండు దీపములన్నియు ప్రకాశించుచుండెను. అంగడులొకటితర్వాత మరియొకటి క్రమముగా మూయబడుచుండెను. టర్నర్ మహాశయుని సత్రవునుండి ప్రయాణీకులు కొందరు రైలుమించునను భీతిచే వడివడిగా రైలుస్టేషనుకు పోవుచుండిరి. కొందరు రైలుదిగి బసలకొరకు సత్రవునకు వచ్చుచుండిరి.

ఆ వచ్చువారలలో బాటొక బంగాళాయువకుడు సుమారు 45 సంవత్సరముల వాడు నొక చిన్నిచే త్రింకు (Suit Case) ను బట్టికొని భుజముమీద నొకమూటను వ్రేలాడ, సత్రవున కేతెంచెను. అతను ప్రయాణపు బడలికచేతనో, మరెందుచేతనో గాని చాలబడలినట్లు చూపరులకుఁ దోచును. అతను సత్రపుసూపరింటెండెంటుగారియొద్దకుఁ బోయి యిట్లు హిందీని ప్రసంగించ మొదలిడెను.

బ—అయ్యా! నా కీరాత్రి కొకగది యిస్తురు. ప్రయాణముచే కడునలసి యున్నాను. మరల తెల్లవారుజామున బండికిపోయెదను.

గు—గదులు లేవు. అన్నియు క్షణములోనే పూర్తి అయినవి. మీరు క్షణము ముందువస్తే గది యిచ్చియుందును. నామాటనమ్మకేని మీరుపోయి చూడండి.

బ—అదియు నాయదృష్టమే! ఏమిచేయుదు! అయినను చూచెదను.

అని వాడొక గది తర్వాత వేరొకగదిని పరీక్షించుచు అన్ని గదులును మార్గస్థులచే నిండియుండినట్లు వాడు గ్రహించెను. ఇంకను నాలుగు గదులు మిగిలియుండెను. వానిలో నేదేని ఖాళీయుండవచ్చునని వాడు పూర్ణాశతో నుండెను. వాడెట్టకేలకు నెం 4 రు గదియొద్దకు వచ్చెను. దాని కినుమంతదూరమున నొక వృద్ధునిలాగున గది గుమ్మమున కవ్వల నొకబట్ట నిండుగ కప్పుకొని గాఢనిద్రలో నున్నట్లు పరుండెను. అంత నాబంగాళివాడు గదితలుపును మెల్లనద్రోసెను. వెంటనే తలుపుయొక్క కుడి రెక్క తెరవబడెను. లోపల దీపమొకటి ప్రకాశమానముగ వెలుగుచుండెను.

ఆబాటసారి యందుచేతనో గాని, పెన్నిధిని గనుగొన్న పేదచందమున ఆకలిగనున్నవు డన్నము లభించిన వానిలాగున, గోల్పోయిన బిడ్డ లభించిన తల్లిదండ్రాదులమాదిక్కు గుంతోషతరంగములచే గప్పబడి క్షణములో లోనికిం బోయెను. దీపమును దానిప్రక్క పాలసీసాయు, దానికి సమీపముననే పసిబిడ్డలు పాలుద్రాగు గాజాబుడ్డియు గలవు. వీటికి సమీపముననే యొక పసిబిడ్డ (ఆడ శిశువు) మిక్కిలి గాఢనిద్రలోనుండుట జూచెను. అంత నాత డా బిడ్డనెందుచేతనో గాని పెక్కుసారులు ముద్దులాడుచుం డెను. ఆ పిల్లమీద అతనికి ప్రేమతప్ప మరేమియు గనుపించుటలేదు. ఈలోపున బాట సారి వచ్చిన ద్వారము మెల్లగ బంధించబడెను. పాప మాబాటసారిమాత్రము దానిని గ్రహించలేకపోయెను. అతని దృష్టి నాశిశువు మీదనే యుండెను.

జిల్లాయధికారియింటివద్ద నెవరో ఆయనతో మాట్లాడుచుండెను.

జి-అ—ఏమండి! సుందర్రావుగారు! మీ మనుమరాలు విషయమై ఆచోకీ ఏమైనను దీసినారా?

పు—చిత్తము! ఆ చోకీ దీయుటేమి? చేయవలసిన పని చేసియే వచ్చితిని.

జి-అ—పిల్ల బ్రతికియున్నదా!

పు—చిత్తము. బ్రతికియే యున్నది.

జి-అ—ఎక్కడ?

పు—టర్నర్ సత్రవులో—నెం 4 రు గదిలో.

జి-అ—బాగు బాగు. వానిలేఖప్రకారము వాడి బసను గనిపెట్టినారు. అయితే యిప్పు డేమిచేసినారు?

పు—పోలీసు సర్కిల్ యినస్పెక్టరుగారితో చెప్పి 4 గురు రక్షకభటులను సత్ర వుకు పంపి ఆగదివద్ద నప్రమత్తులై యుండుడనియు నేను తమవద్దకు పోవుచుంటినని యు చెప్పి వచ్చితిని.

జి-అ—ఆగదికి తాళమువేసి బందుబస్తు చేసితిరా?

పు—అయ్యో ! తాళము వేయకుందునా ! వాడి వేషమును జూచియుకూడ యూర కుందునా ?

జి-అ—ఏలాగున వున్నాడు ?

పు—బంగాళీవాని వేషము వేసి ~ చమత్కారముగ నటించెను.

జి-అ—అయిన మనమిప్పుడే పోయి బంధితము.

పు—మంచిది. మీరు త్వరగా పోలీసునూపరింటెండెంటుగారిని దీసికొని గది తలుపులు తీయించి వానికి బేడీలువేయించి స్టేషనుకు తీసుకురండి.

జి-అ—మీరో !...

పు—నేను రానవసరము లేదనుకుంటాను. ఈలోపుగ నేను స్టేషనుకుపోయి తగు గదిని యోచించి సిద్ధముగ నుండెదను. ఈమాత్రము మీరు చేయజాలరా ?

జి-అ—తప్పక చేసెదము. మీకెట్లువీలో అట్లే చేయుదు. నేను పోవచ్చునా !

పు—అవశ్యమువద్దు. అతిజమూరు. మీరు దయవుంచి మీ సైకిలు నొకసారి యిప్పించెదరా ? మీరు మోటారుమీద పోవచ్చును.

జి-అ—అట్లే దీసికొనిపొమ్ము. అని వానికి తనసైకిలునిచ్చి తన కారుమీద పోలీసునూపరింటెండెంటుగారింటికిపోయి ఆయనతో సంగతి సాంతముగా చెప్పి వారుభయులును గలసి సత్రవువద్దకు బోయిరి.

కారుదిగి వారు లోనికిబోయి నెం 4 రు గదివద్దనున్న రక్షకభటులను జూచి యిట్లనిరి.

సూ—ఏమిరా ? వారత్తవుండెనా ?

ర—లోనుండి తలుపుతీయుమని గొడవచేయుచుండెను. పత్తేదారుడు బాబు మాకు కఠినమైన హుకుం యిచ్చినారు.

జి-అ—తలుపుతీయుము. ఈ క్రూరుని వదలిపెట్టుటా ? తప్పక ఉరిశిక్షయే—

అంత వారభటులు తలుపులను దీసినతోడనే వారందరును లోనికరిగి వాహంత కునికి బేడీలు (Hand Cups) వేయుచుండిరి. ఆబాటసారి యొకమారు నాయధికారుల వైపునకు జూచి వారితో నేదియో సంకేతమున జెప్పెను. అంత వారందరును నొక్కమా రొకరి మొగములవైపు నొకరు జూచుకొని ఆశ్చర్యనిమగ్నులై స్తంభీభూతులైరి. అంత జిల్లాఅధికారి యిట్లనియె. "ఎంతమోసము ! వాడు తప్పక మాయలమారి. మనల నందరిని శుద్ధ మూర్ఖులక్రింద మార్చినాడు. అందులో నన్ను నమ్మించి నా బైసికిలును దీసికొనిపోయినాడే, అమ్మా ! వాని గుండెధైర్యము !

సూ—వాని కెంతధైర్యము లేకపోయిన మీవద్దకువచ్చి మిమ్ముల నమ్మించి మీ బైసికిలును దీసికొనిపోగలడా ?

జి-అ—యీ రాత్రి యెవరి నంతముచేయుటకో ? అని వా రనేకసంగతులు జెప్పి కొనుచు కర్తవ్య మాలోచించుకొనుచుఁ బోయిరి.

మా పాఠకమహాశయులు గదిలోవున్న బంగాళీవాడు పత్తేదారుడు సుందరరావు గారనియు, ఆ బాలిక గోల్పోయిన తనమనుమరాలనియు గ్రహించిరనియే మాయూహ;

జిల్లాఅధికారివద్దకుఁ బోయి మాట్లాడి ఆయన బైస్కీలును హరించిన హంత్ర కథానాయకుఁడైన "భయంకర చోరాగ్రేసరచక్రవర్తి" అనియు నికవేరే చెప్పనక్కరలేదు. సుందరరావుగారు పిల్లను దీసికొని యింట దుఃఖించుచున్న తన కుమార్తెకిచ్చెను. ఆమె సంతోషమును మాచదువరులే యూహింప ప్రార్థితులు.

---

## 10 వ ప్రకరణము.

---

(శుభలేఖ)

టర్నర్ మహాశయుని సత్రమున కెం 4రు గడిలో మరునాడరుణోదయమున నిద్దరు ప్రయాణీకులును వారివెనుక పెట్టెలను మోసికొని నిరువురు కూలివాండ్రును ప్రవేశించిరి. వారు తెల్లని చలువచేసిన దుస్తులను దొడిగికొనుటచేతను వ్రేళ్ళకు బంగారపు క్రొత్త రకముల యుంగరము లుండుటచేతను కుడిచేతిమణికట్టుకు బంగారపు గొలుసు తెల్లపొడి రాళ్ళతో చెక్కినది యుండుటచేతను చెవులకు పుష్యరాగపు దుద్దులుండుటచేతను వారు గొప్పధనికులనియే చెప్పవచ్చును. కావుననే సత్రపు గుమాస్తాగారిదివరకు గదులు లేవని కొందఱికి నిష్కర్షగా జెప్పినను వీరివేషములు జూచి తక్షణ మొకగదిని ఖాళీచేసి యిచ్చెను. గుమాస్తాగారి మర్యాదకు మెచ్చిరో మరెందుచేతనోగాని వారు గుమాస్తాగారి చేతిలో నాలుగుశుంకములను బెట్టిరి. అంత ఆయన వీరికి నమ్మకమైన భృత్యుఁ డయ్యెను. వారిద్దరును కొంతసేపటి కిట్లు మాట్లాడుచుండిరి—

ప్ర—మిత్రమా! నీచర్య లతివిచిత్రములు. నాకవి కడుభీతిని గొల్పుచున్నవి.

ద్వి—ఎట్లయినను యుద్యమమును నెరవేర్చుకొన వలయునుగదా! నాడా దుర్మార్గుడు చేసిన పరాభవాగ్ని యొకమూలను పత్తేదారుని దారుణకృత్యములను దలంచుకొలది యొడలు భగ్గున మండుచున్న కారణమున నట్లు చేయుచుంటిని.

ప్ర—అవునుగాని, మనము ముందుసంగతిని వానికి దెలిపిచేయుట మిక్కిలి హానికరము.

ద్వి—ఏమియు హానిలేదు. దుర్గాప్రతాపులవలె పౌరుషకీర్తులు సంపాదించవలెనుగాని పౌరుషహీనులవలె ప్రవర్తించుట పాడిగాదు.

ప్ర—సత్యమే గాని, యుక్తాయుక్తముగ కార్యసాధనము చేయవలెను.

ద్వి—అవును. అట్లే చేయవలెను. మనము తొందిరపడి యేకార్యమును జేసితిమి?

ప్ర—ఇంతవరకు లేదు. అయితే వివాహ మెప్పుడు?

ద్వి—రేపురాత్రి 3 గంటలకు.

ప్ర—ఈసంగతిగూడ వానికి తెలియపర్చెదరా?

ద్వి—తప్పక నీవు శుభలేఖను జూడలేదా?

ప్ర—చూడలేదుగాని, మీరుమాత్ర మట్లు వానికి దెలియపర్చవద్దు. నీవు వివాహ మాడిన నేను జూచి సంతోషించెదను.

ద్వి—మిత్రమా ! నీవు పిరికివండును బోలెదవేమి ? నాదుర్గాప్రతాపుల శౌర్యపరాక్రమములను జ్ఞప్తియం దుంచుకొనుము. విచారమును తొలగుము. ధైర్యలక్ష్మిని పురికొల్పుము. దిగ్విజయము క్షణములో చేకూరును. లేఖను చదువమనెదవా ?

ప్ర—మంచిది. చదువుము.

ప్రియమైన సుందరరావు పంతులుగార్కి—

మీరు శ్రమపడి చివరకు మీమనుమరాలిని గనుగొన్నందుకు మిక్కిలి సంతసించితిని. మీరు బంగాలీవేషమున వచ్చి నెం 4 రు గదిలో కూర్చునియుండగా జిల్లా అధికారి మొదలగువారు వచ్చి మిమ్ములను గౌరవించుట చాల శ్లాఘనీయము. మీరు తలుపును దీయునప్పుడు గుమ్మమువద్దనే పరుండితిని. పాపము ! మనుమరాలిమీద ప్రేమచే నన్ను చూడలేదు. మీ జిల్లా అధికారిగారి బైసికిలు నాయొద్దనే యున్నదని చెప్పుడు. దానికొరకు మీరుగాని ఆయనగాని శ్రమపడి వెదుకనక్కరలేదు. నేనే నాపని అయిన తర్వాత అయనకు వప్పగించి రశీదు పుచ్చుకొందును. ఈరాత్రి వాల్తేరు స్టేషనుకు ఈశాన్యమూలనున్న బంగాళాలో నాకు వివాహముచేయ పెద్దలు నిశ్చయించివారు. గావున తమరు బంధుమిత్ర సహితముగావచ్చి వివాహము చేయించి, నేను గావించు మన్ననలనుగ్రహించ ప్రార్థితులు. నా క్షేమమును గోరువారును, నా వృద్ధికై పాటుపడువారును నైన మిమ్ములను నేను స్వయముగ వచ్చి పిలువనందుకు క్షమించి కార్యమును నెరవేర్చగల బాధ్యతను వహించ ప్రార్థితులు.

మంగళంమహాత్ శ్రీ శ్రీ శ్రీ

మకాం
టర్నర్ సత్రవున
నెం 4 రు గదిలో

ఇట్లు,
భయంకర చోరాగ్రేసర చక్రవర్తి.

---



ప్ర—బాగున్నది. మీ ధైర్యమద్వితీయమైనది. కాని బాబు ఒకవేళ వాడు వచ్చిన కార్యము చెడదా ?

ద్వి—ఎన్నటికిని చెడదు. వాడొకవేళ వచ్చినయెడల వానిని తప్పక బంధించి పట్టుబెట్టనా? కాబట్టి నీవు యీజాబును బైటపోవు టపాలా జవానుచేతిలో నొక రూపాయినిబెట్టి వానికిమ్ము.

ప్ర—మంచిది. అట్లే చేసెదను గాని మరి పిల్లసంగతి?

ద్వి—పిల్లను ఇంతకుముందే తీసుకుపోయి ఆ బంగాళాలో వుంచితిని.

ప్ర—ఎట్లామెకు నచ్చచెప్పితివి?

ద్వి—ఆసంగతులు ముందు చెప్పెదను. మనము ముందు ప్రయత్నములను జేయ వలసియున్నది.

ప్ర—భోజనమునకు ప్రయత్నము చేయుదునా?

ద్వి—మంచిది. ఈలోపుగా నేను సత్రవు గుమస్తాగారితో చెప్పి పేరు మారిపించి వచ్చెదను.

ప్ర—అది ముఖ్యముగా చేయవలెను. నేను వంటచేసెదను. అని వాడతి త్వరితముగ తనదుస్తులను మార్చి పొయ్యి వగైరాలను సిద్ధముచేసి వంటచేయుట కుపక్రమించెను. ద్వితీయుడు గుమాస్తాగారితో ప్రసంగించి చిట్టాలో పేరును మార్పించెను.

పత్తేదారు డట్లు తనకుమార్తెను సంతోషపెట్టి హర్తనుగుణములను గురించి తనలో యోచించ మొదలిడెను.

"ఆహా! వీడెట్టివాడు? దుర్గాప్రతాపులకన్న మిన్నయై దోచుచుండెనే? వీడు నన్నెంతలో గ్రహించి బంధించినాడు. మీదుమిక్కిలి యధికారివద్దకుబోయి నమ్మించి వారిసైకిలును హరించినాడు. ఎంతచమత్కారి? వీడఖండ ప్రతాపశాలిలాగున దోచు చుండెను. మాయింట సుఖనిద్రలోనున్న పిల్లను క్షణములో హరించెను. వానిజట్టు లోనివానిని నాయొద్ద సేవకునిగా నియమించి నాయింటిగుట్టును గ్రహించెనే? కీడులో మేలన్నట్లు పసిబిడ్డ కిసుమంతయేని హానిని కలుగజేయలేదు. మీదుమిక్కిలి దానికి పాలు వగైరాలను బోసి సౌఖ్యముగ సరిరక్షణచేసెను. ఆహా! వీని ఔదార్యము భూత దయాళుత్వము కొనియాడదగినది. అయినను వీనిని బంధించవలసియున్నది. ఇంతవర కును నాకు వీడిబసగాని యనుచరులుగాని తెలియుటలేదు, కాని తెలిసికొనక తప్పదు" అని యోచించుచుండగా నొక యువకుడు" వడివడిపరుగెత్తుచు వచ్చి పత్తే దారుని గుమ్మము మీద వ్రాలి "అయ్యా! సుందరంబాబు! అని యొక పెద్దకేక వేసెను. అంత లోనుండి పత్తేదారు డదరిపడి బైటకువచ్చి వానినిజూచి "ఏమండీ! అంతతొం దర!" అని ప్రశ్నించెను.

యు—కొంప మునిగిపోయింది.

సు—ఎందుచేత?

యు—పాపము! కమల కనుపించుటలేదు.

సు—గంపా పాపయ్య భార్యా?

యు—అవునండి.

సు—ఎప్పటినుండి?

యు—రాత్రినుండి.

సు—ఎవ రపహరించిరి?

యు—ఎవరో రాత్రి మీవేషమును ధరించి, మీనామముతో వచ్చి ఆమెతో ముంతనములాడి దీసికొని పోయినట్లు చెపుతారు.

సు—ఎవరు?

యు—ఇరుగు పొరుగువారు,

కు—సరే, విచారించిచూచెదను. మీరు వెళ్ళి ఆచోటికి ఏమైన దొరికితే నాకు చెప్పుడు.

యు—చిత్తము. సెలవు దీసికొందును. అని నాయుడు తనత్రోవను బోవుచుండెను. పత్తేదారుడు "ఆహా! వీడి క్రూరత్వమున కద్దులేదు. పాపము! భర్తను, అత్తగార్ని వధించి యీపాపిమూలమున చింతాక్రాంత యగు కాంతను వంచించి తీసికొనిపోయిన పాతకిని పట్టి పల్లార్చినంగాని నేను నిద్రపోవుట కల్ల" అనుకొనుచుండెను. ఇంతలో తపాలావాడొకజాబును దెచ్చియిచ్చెను. దానిని చదివికొని తల పంకించి, మహోగ్రాద్రముతో కండ్లెర్రజేసి "వీడింతలోనే సుందర్రావు సంగతి మరచెను గాబోలు! వీని కంటికి సుందర్రావంత చేతగానివాడుగా గనబడుచుండెను గాబోలు. వీడి బస సత్రవులోనా? యీరాత్రి వివాహమా! పాపమూ భర్తను గోల్పోయిన పిల్లను బలవంతపెట్టును గాబోలు. సరే చూచెదను." అని లోనికిపోయి దుస్తులను ధరించి తన మోటారుసైకిలుమీద టర్నరు సత్రవునకు గాబోలు పోవుచుండెను. ఆయన తుదకు సత్రవువద్ద దిగి లోనికరిగి గుమాస్తాగారివద్దకు బోయి నెం 4 రు గదిలో ఎవరుండిరో యని వాకబుచేసెను. అగుమాస్తాగారంత తన చిట్టానుదీసి నాయధికారిముందర పెట్టెను. అందులో నిట్లు వ్రాయబడియున్నది.

(నెం 4 రు గది చిట్టా)

| నంబరు | ప్రవేశం | | వదలి పెట్టుట | | ఆసామీల పేర్లు. | గ్రామం పేర్లు. | జిల్లా. |
|---|---|---|---|---|---|---|---|
| | తేది | గంటలు | తేది | గంటలు | | | |
| 1. | 10-4-09 | రాత్రి 11 గం లకు | 11-4-09 | పగలు 6 గం లకు | వేపా రామయ్య | మండపేట | గోదావరిజిల్లా |
| 2 | 12-4-09 | పగలు 8 గం లకు | 13-4-09 | రాత్రి 9 గం లకు | వాసాబత్తుల సత్తిలింగం | కోలమూరు | గోదావరిజిల్లా |
| 3. | 14-4-09 | పగలు 3 గం లకు | 15-4-09 | రాత్రి 3 గం లకు | వేదం వెంకన్న | చాగల్లు | క్రిష్ణాజిల్లా |
| 4. | 16-4-09 | పగలు 10 గం లకు | | | నేతి అన్నపూర్ణమ్మ | రాయవరం | గోదావరిజిల్లా |

అయితే యిప్పుడా గదిలో నేతి అన్నపూర్ణమ్మగారున్నారా?

గుమా—చిత్తము. వారిప్పుడే ప్రవేశించి వంటచేసికుంటూ వున్నారు.

సు—ఎంతమంది ?

గు—నాకుబాగా తెలియదు. పోయి చూచెదమా ఒకముసలిది ఇంకొక యవ్వనస్త్రీ

సు—పదండి చూద్దాము.

అంతవారిద్దరునుబోయి తలుపునుగెంటి లోనికిచూచిరి. ఆ యవ్వనస్త్రీకి కుడి కంటికొక అకుపచ్చని గుడ్డకట్టబడియుండి భూమిమీదపడి మిక్కుటముగ బాధపడు చుండెను. తలుపు తీయుటచే గాబోలు నావృద్ధవితంతువు లోనివసారాలో పట్టుపంచ కట్టుకొని వంటచేయుటమాని గదిగుమ్మముదద్దకువచ్చి వారితో నిట్లనియె. ఆమె వేష భాషలను జూచిన అమాయకురాలని తప్పకదోచును.

అవ్వ—ఏమినాయనా ?

సు—మీదేయూరు అవ్వగారు ?

అవ్వ—మేము యీ రాత్రి బండిమీద అనపర్తి వెడతాము. అప్పుడు మీరు యిందులో ప్రవేశించవచ్చును.

గు—అదికాదు. మీదిఏవూరు ?

అ—అమ్మాయికి కంటివైద్యమునకు వచ్చినాము. ఈరోజునను అసుపత్రిలో శెలవు యిచ్చారు. రెండు మెతుకులు వండి తిని వెంటనే పోతాము.

సు—ఆమెకు చెముడులాగున తోచుచున్నది. కాస్తబిగ్గరగా చెప్పుము.

గు—చిత్తము. అదికాదమ్మా ! మీదిఏవూరు ?

అ—మాదండి. రాయవరం. అనపర్తివద్ద దిగాలి అక్కడికి అబ్బాయివస్తాడు.

సు—మీయింటిపేరు ఎవరు.

అ—నిన్ననేవుత్తరం వ్రాయించినాను. వుత్తరం వ్రాసినందుకు అయిదు అణాలు పుచ్చుకున్నాడు. మాయదారి పట్టవాసంగాని బాబు మాబోటివాళ్ళం బ్రతుకలేము.

గు—మీయింటిపేరు ఎవరు ?

అ—వచ్చేటప్పుడు మావాడు నూటఏభైరూపాయలు యిచ్చాడు నాయనా! ఇప్పుడు రైలుఖర్చుకు 4 రూపాయలుమాత్రము మిగిలినవి. చంటిపిల్లకు దొండకాయ గాని మొండిచేటగాని కొనుక్కొని వెళ్ళుటకైనా దమ్మిడీలేదు.

సు—అబ్బా! యీచాదస్తం చెముడితో ప్రాణం విసుపుతూ వున్నది. మీయింటి పేరమ్మా !

అ—అయ్యో! నాయనా! నాకుకాస్తచెముడు. మాయింటిపేరు నేతివారు. నాపేరు అన్నపూర్ణ.

సు—మీరెప్పుడు ప్రవేసించినారు ?

అ—మానాన్నగారు కాశీవెళ్ళినారు. వచ్చి మరల రామేశ్వరంవెళ్ళి అక్కడ గంగపట్టుకొని మరల కాశీవెళ్ళివచ్చుసరికి నేను పుట్టినాను. అంత నాపేరు అన్న పూర్ణమ్మపేరు పెట్టినారు.

గు—అబ్బబ్బ—మీరు ఎప్పుడు-ఇందులో-ప్రవేసించినారు.

అ—అయ్యో! నాకేమినాయనా! కాశీవిశ్వేశ్వరునిభార్య అన్నపూర్ణమ్మపేరే!

సు—"బాగుబాగు! ఆమెతో మాట్లాడుట చాలాప్రయాస అయినసంగతి మనము పోవుదము. ఈఅమాయకురాలితో మాట్లాడుటంత తేలికగాదు." అని వారిద్దరు నక్కడినుండి వేరేసలమునకుఁ బోయి రహస్యముగ నాగుమూర్తిగారితో కొన్నిసంగతులు చెప్పి జాగ్రత్తగ కనిపెట్టుచుండుమని యాజ్ఞాపించి తామెక్కడికో పోయెను.

పాఠకులీస్త్రీల గురించి నించుక యోచించగలరా? వృద్ధవనిత దాదాఅనియు నేలమీద కంటిబాధచే మైమరచినట్లు పడియున్న స్త్రీచక్రవర్తి అనియు చదువరులకు తెలియని సంగతికాదు.

## 11 వ ప్రకరణము

### వివాహము అరెస్టు.

రాత్రి సుమారు 9 గంటలాయెను. విశాఖపట్టణ స్టేషనునుంచి యొక ప్యాసింజరురైలు (Passenger train) వచ్చుచున్నది. అది వాల్తేరుస్టేషనులో ఆగి జనులను కొద్దిగ సామానులను యెక్కించుకొని విజయనగరంమీదుగా కలకత్తాపోవును. జను అడావిడి, అత్రుత వర్ణనాతీతము.

మనమిప్పుడట్టి వర్ణనలతో కాలక్షేపము చేసినయెడల వివాహ ముహూర్తము దాటిపోవును. కాబట్టి త్వరపడవలయును.

అంత రైలులోనుండి యొక ఆంగ్లేయుడు ఎడమచేతినొక చిన్న తోలుపెట్టెను పట్టికొని కుడిచేత నొకనల్లకర్రను వెనుకకుముందునకు యూపుచు యింగ్లీషుఫలహారముల గదిలోనికి (Refreshment Room) బోవుచుండెను. వానికి సుమారు నలుబదిసంవత్సరముల ప్రాయముండును. కొంచెము బలిష్టునిలాగునసే గన్పట్టుచుండెను. ఆఫలహారముల గదియొద్ద నొక ఆంగ్లస్త్రీ సుమారు 30 సంవత్సరముల ప్రాయముగలది. యవ్వనియొకతె నిలుచుని వానికి స్వాగతమిచ్చెను. అంతవారుభయులు చిరపరిచితులవలె లోనికరిగిఇట్లాంగ్లమునసే ప్రసంగించిరి.

స్త్రీ—"మీారెక్కడికి పోయెదరు ?

పు—ఖర్గపూరు ?

స్త్రీ—అక్కడేమిపని?

పు—న్యాయాధికారిని (Judge)

స్త్రీ—ఈబండిలో పోయెదరా?

పు—అవును ! మీారెక్కడికి పోయెదరు ?

స్త్రీ—నేను నాగపూరు పోవలెను.

పు—నీ భర్త కేమిపని ?

స్త్రీ—నేనింకను నవివాహితను.

పు—అయిన క్షమించుము. నీతండ్రికేమిపని ?

స్త్రీ—నాతల్లిదండ్రాదులు లేరు. నే నేకాకిని.

పు—అట్లనా—అక్కడేమి చేయుచుంటివి ?

స్త్రీ—బాలికాపాఠశాలల కధికారిని (Inspectress of Schools) అయితే మీకు వివాహమైనదా ?

పు—లేదు తగినపిల్లను జూచి యీసంవత్సరం మనదేశంవెళ్ళి వివాహము చేసికొనవలెననియున్నది.

స్త్రీ—అయిన బాగున్నది, నన్ను ప్రేమించెదరా ?

పు—"ఇంతకన్ననా ?" అని ఫలహారముల యజమానుని(Butler) పిలచి రెండు సోడాబుడ్లను దీసికొనిరమ్మని చెప్పెను. తోడనే వాడు రెండు బుడ్లను గ్లాసులను దీసికొనివచ్చి నొకటికొట్టి గ్లాసులోపోసి దొరగారికిచ్చెను. అంత ఆయన మర్యాద ననుసరించి నాగ్లాసును ప్రక్కనే కూర్చునియున్న దొరసానికిచ్చెను. తరువాత తాను మరియొకటినిత్రాగి రెండుసిగరెట్లను దెమ్మని యుత్తరు విచ్చెను. వాడా ప్రకారము రెండుసిగరెట్లనుదెచ్చి బల్లమీద దొరసానికి సమీపముననే పెట్టిపోయెను. తరువాత నాదొరసాని యొకటిదీసి దొరగారికిచ్చి తాను మిగిలినదానిని గాల్చ మొదలిడెను.

దొరగారు సిగరెట్టును సగము కాల్చు సరి కావలింత లారంభమై క్రమముగా మైకము గప్పుచుండెను. కొంతసేపటికి కాయనకు నిద్రవచ్చుటచే తన పడకకుర్చీలోనే నిద్రించెను. ఇంతలో రైలు యీలగొట్టి కదలెను. దొరగారికి గాఢనిద్రయే. దొరసానిగారికి సంతోషమే. కొంతవడి కాదొరసానియు మరియొకడును గలసి దొరగారి నొక చిన్నగదిలో పరుండబెట్టి ద్వారమును బైట బంధించి తాను స్టేషనుకు యీశాన్యమూల నున్న బంగాళాకు గాబోలు బోవుచుండెను.

ఆ బంగాళానుగురించి మన మించుక తెలిసికొనవలసియున్నది. అది విశాలమైన భవంతనియే చెప్పవచ్చును. దానిలో ఏదైన కచేరీ పెట్టుటకు గాబోలు కట్టిరి. కాని ప్రస్తుతము దానికి మరమ్మత్తులు చేయుచుండిరి. దానిలో విశాలమైన హాలును, హాలుకు సుమారు పది ద్వారములును, దాని కుత్తరమున నొక చిన్నగదియు గలవు. దానిలో విద్యుచ్ఛక్తి దీపములు పంకాలు మిక్కుటముగ గలవు.

ఈబంగాళాహాలులో సుమారు 40 మంది యువతులు ఆయుధపాణులై కూర్చునియుండిరి. వారిలో వారు నెమ్మదిగ లోకాభిరామాయణములను జెప్పికొను వారును, రొదచేయవద్దను చేసైగలు చేయు వారును నైయుండిరి. వారిమధ్య మాపిన వలువగట్టి కన్నీరు మున్నీరగునట్లు దుంఖించు శోకదేవతయో యనున నొక స్త్రీ నీయాపత్సముద్రము నెట్లు తరింతునా యని దీనవదనయై ఆ శ్రీహరిపాదారవిందములను హృదయమున నిల్పి భజించుచుండెను. ఆమె యించుకబైటికి దుఃఖించిన యమభటులం బోలు వాకిరాతులు ఆమెనోరు నొక్కుచుందురు. అట్టి అనాథవనితకు దిక్కెవ్వరు ? వీరిబారినుండి దప్పించుకొను టెట్లు ? మానవతులమానము లెవ్వరు గాపాడుదురు ? ఎవ్వరి మానమును వారే గాపాడికొనవలెను. [illegible]

ప్రస్తుతపుస్థితిని ననుసరించి తాను గాపాడి రక్షించుకొనలేనని ఆశ్చర్యముతోచుచున్నది. కాబట్టి ఆమె యెంతదుఃఖములోనున్నను, యెట్టిబెబ్బులులమధ్యనున్నను మాటిమాటికి "రామా నారాయణా! శ్రీహరి! ఆపద్బాంధవా! గోవిందా! రక్షించు రక్షించు" అను శబ్దములు మాత్రము స్మరించుచుండెను. ఆమె భక్తియేనిశ్చలమైనభక్తి యయ్యెనేని, ఆశ్రీహరి ఆర్తత్రాణ పరాయణ బిరుదాంకితుడేని ఆమె నుపేక్షచేయునా?

ఇంతలో నొకతలుపువద్ద చిన్నశబ్ద మొకటి వినిపించుటతోడనే ద్వారపాలకుడు తలుపును దీసెను. తోడనే యొక దొరసాని ఆద్వారముగుండా లోనికి ప్రవేశించెను. అంత లోని ఆయుధపాణు లందరును నొక్కుమ్మడి యాతనినిజూచి లేచి వానికి స్వాగత మిచ్చిరి. తోడనే నాదొరసాని ఆ శోకించుస్త్రీయొద్దకుఁ బోయి నామెను పలుకరించెను. అంత నామెకు క్రోధవిచారములు హెచ్చి వానితో నిట్లనియెను.

కమ—ఓరీ! మాయలమారి కిరాతుడా! నన్నెట్టికష్టముల పాలుచేయుచుంటివిరా!

దొర—నీకేమియు నోరుచేయకుము. నేనుచెప్పినట్లుగా నన్ను వివాహమును చేసుకొంటివేని నీకేమియు కష్టములుండవు.

కమ—నీ వివాహముకాలా—నాభర్తను అత్తగారిని అకారణముగ జంపి ధనమును దొంగిలించి నన్ను వంచించి ఇక్కడికి తీసికొనివచ్చి, యిట్టి దుర్భాషలాడుటకు నీ నోరెట్లు వచ్చినదిరా?

దొర—నీభర్తకొఱకును అత్తగారికొఱకును విచారింపకు. వారు చేసికొన్నపాపము వారినే తీసికొనిపోయినది. సన్మార్గులను అవమానపరచి వారి ఆస్తి నకల్పితముగ జేసికొనిన ఆపాపుల మాటెత్తకు. నామాట చూచుకొనుము—

కమ—నీన్యాయము కాలా! వారన్యాయ ప్రవర్తులును నీవు న్యాయప్రవర్తుడవునా! నీన్యాయము నీతోకాల! ఆసర్వేశ్వరు డూరకొనునురా? ద్రోహి—

దొర—ఊరకొనలేదు. ఊరకొనలేడు. నాతో నిన్ను వివాహముచేసికొనుమని యిచటికి పంపినాడు. నీ కోపముల నికకట్టిపెట్టి కర్తవ్యమాలోచింపుము. ఆలస్యముచేసిన లగ్నము మించిపోవును.

అంత కమల వానితో వాగ్వాదముచేసిన కార్యములేదనియు ఆకాలములో హరి నామస్మరణ చేసికొనిన తప్పక ఆమెను ఆశ్రీహరికాచి రక్షించుననియు నమ్మి, వాని పాదములను మనస్సున నిల్పికొని భజింపుచు తన్మయత్వముతో భూమింబడెను.

అప్పుడు గంటలుకొట్టువాడు టంగుమని ఒకటికొట్టెను. రైలుస్టేషనులోఫలహారిములగదియొద్ద చిన్నగదిలో నున్న దొరగారికి పూర్తిగ తెలివివచ్చినది. ఆయన తనశయ్యనుండి లేచి, నలుతట్టులజూచి, తాను బంధీకృతుడగుటకు మిక్కిలి చింతించి, తావచ్చినపని పాడైపోవునని యోచించి బైటకుపోవుటకు మార్గమునకు గాబోలు వెదకుచుండెను. ఆ గదికొక్క ద్వారముతప్ప మరితరద్వారములుగాని గవాక్షములుగాని లేవని గ్రహించి యొకసిగ్గుమార్పును విడచి దైవముమీద భారముంచి తనశయ్యపై గూర్చుండెను.

కొంతసేపటికి తలుపువద్ద నేదియోశబ్దము వినవచ్చుటచేత తాను మరల శయ్యపై

పరుండి మృతకళేబరమువలె శ్వాసాదులను బంధించి, పరుండెను.

అంత మన దొరసాని, మనస్సున యెందుచేతనో గాని సందియము దోప ఆవివాహవేదికనుండి లేచి, సందియము నివర్తించుకొఱకు మరలి ఫలహారముల గదివద్దకు వచ్చి దొరగారి యోగక్షేమమును దెలిసికొనుటకు, అగదియొద్దకువచ్చి తలుపు రంధ్రమువద్ద తన చెవినొగ్గి ఆలకించి, సందడేమియు రాకుండుటకు వెరగంది "అరే! వీడు పలాయనమయ్యెనా? లేక మృతుడయ్యెనా? ఎట్లైనను జూచి పోవుటకేగదా వచ్చితిని. చూచిపోవుటే మంచిది." అని దృఢనిశ్చయురాలై బీగములనుదీసి తలుపును దెరచి లోనికిపోయెను ఆ గాఢాంధకారమున నాదొరగారి దేహమంతయు పరీక్షచేసి, నిజముగ మరణించినట్లు గ్రహించి, తన యుద్యమము నిరాటంకముగ నెరవేరునని సంతసించి, మనస్సున పరిపరివిధముల నాలోచించుకొనుచు నాగదిని విడిచిపోయెను. వెళ్ళునప్పుడు వివాహముహూర్తము దాటునగియో దొరగారు మరణించెనను సంతోషమువలనో, మరెందుచేతనో గాని, తలుపులను దగ్గరవేయుటేగాని బంధించకే వివాహవేదికవద్ద కతిత్వరితముగ పోయి తగు సన్నాహము చేయుచుండెను.

తరువాత నాదొరగారు లేచి, మెల్లగ ద్వారమువద్దకు బోయి తలుపును లాగెను. అదియు వీనియుద్యమమునకు సహకారియగునట్లు తెరువబడెను. దొరగారి మనస్సున ఆనందము చెప్పనలవిగాకుండెను. తలపంకించుచుండెను. కండ్లెఱ్ఱచేయుచుండెను. భగవంతునికి నమస్కారములు చేయుచుండెను. ఇట్లు యోచించుచు వాయువేగమున వివాహవేదికవద్దకు బోవుచుండెను. అట్లు బోయి నా బంగాళాచుట్టు తిరిగి తలుపు లన్నియు బంధించబడియున్నందుకు విచారించుచు, మరలొకయుక్తి నాలోచించి నొక ద్వారమువద్దకు బోయి చెవియొగ్గి లోన రొదను యాలకించుచుండెను. లోపలనొక స్త్రీరోదధ్వనియు, పలువురయార్భాటములును వానికగ్గములంబడెను. తాను ఎవరి నిమిత్తమై అట్లు తరింపరానికష్టములో మునిగిపోయి మరల బైటకువచ్చెనో అదియే లభించినట్లు సంతోషించి, ప్రాణములమీదను దారాపుత్రులమీదను ఆశను విసర్జించి, తాను నేడు మృత్యుసన్నిధానమునకు బోవుచున్నట్లు తలంచి, తన దుస్తులను క్షణములో మార్చి యొకకిరాతుని వేషమును ధరించి, నొకద్వారము వద్దకుపోయి నిలుచుకట్టెను. ఆద్వారరక్షకుడు తనజట్టులో నొకడేదియో వింతవార్తను దెచ్చెననుకొని వెంటనే తలుపులను దెరచెను. తోడనే వాడు లోకింబోయి తలుపుదెరచిన వానిచెవులో "మనవాళ్ళను రొదసేయవద్దని చెప్పుము. రక్షకభటులు లాత్రోవను బోవుచుండిరి." అని చెప్పెను. మిగతావాళ్లకు రొదచేయవద్దని సంజ్ఞమూలమున చెప్పి తలుపులన్నియు జాగ్రత్తగ బంధించమని చెప్పెను.

ఒకక్షణములో నొకయువకుడు మిక్కిలి విలువగల దుస్తులను ధరించి విలువగల భూషణములను అలంకరించుకొని, సభకువచ్చి పిల్లనుదీసికొనివచ్చుట కుత్తరువిచ్చెను. ఈతనే పెండ్లికొడుకని ఆ నూతన పురుషుడు యోచించుచుండెను. అంత నాబాల గోలలెత్తుచు ఆకిరాతుల మధ్యకు శోకదేవతవలె వచ్చెను. ఆమె యెన్నిదూషించినను, యెన్ని బ్రతిమాలుకొన్నను, వానికి లక్ష్యమా? ఆమెను బలవంతము చేసియైనను పెండ్లాడవలె

నని దృఢనిశ్చయుండై నలుగురు భృత్యులనుజేరి, ఆమ కాళ్లుచేతులను బంధించ నాజ్ఞాపించెను. వారును స్వామి యాజ్ఞప్రకారముతేచి నా స్త్రీయొద్దకుబోయి తమపని చేయుటకు సంసిద్ధులై యుండిరి.

అంత నొకద్వారముపద్ద పెద్దధ్వనితో నొకపురుషుడు భీభత్సాకారముతో నిలుచుని, చేతనొక పిస్తోలును బట్టికొని యిట్లనియె. "ఓరీ! ద్రోహులారా! అగుడాగుడు! ఒక్కడుగైనను అవలబెట్టినను, ఒక్కపనియైన చేసినను మీబుర్రలూడి క్రిందబడునని నమ్ముడు." అని ధైర్యముగా నిలబడెను.

ఆద్రోహులందరును భయాశ్చర్యనిమగ్నులై నివ్వెరపడుచు నాపురుషునివైపు చూచుచు, ఆయన పత్తేదారుడు సుందరరావని గ్రహించి కార్యము మించినదని నిశ్చయించి ఆ హాలులోనున్న దీపములను క్షణములో నార్పి మెల్లగ నాభవనమును విడిచి పలాయనమై ఆద్వారము లన్నియు బైటబంధించి పోయిరి. ఆ స్త్రీనిగూడ నక్కడే వదలిపోయి వారిప్రాణములను రక్షించుకొనిరి. పత్తేదారు డొంటరి యగుటచేతను, చేనున్న ఆయుధము బలహీనమగుటచేతను, ఆయన వారిని వెంటాడలేకపోయెను. కాని కీడులో మేలన్నట్లు అనాథస్త్రీని సంరక్షించగలందులకు మిక్కిలి సంతసించుచు, నాబంగాళాలో నాస్త్రీతో ప్రసంగించుచు ఆమె చెప్పు కథను శ్రద్ధతో నాలకించుచుండెను.

## 12 వ ప్రకరణము

### మరల పత్తేదారుడే.

వాల్తేరు రైలుస్టేషన్ వద్దనున్న తంతిఆఫీసు (Telegram office) కొక యువకుడు పోయి, అందున్న యధికారి (Telegram Master) కొక తంతినిచ్చి దానిని తక్షణం పంపించమనియు అట్లు పంపనియెడల సర్కారుకు చాలనష్టమువచ్చుననియు చెప్పెను. ఆయన నట్లే పంపుదుననిచెప్పి యిట్లుచదివెను.

| | |
|---|---|
| | ఎక్స్‌ప్రెస్సు. |
| | జిల్లా అధికారి, విశాఖపట్టణము. |

| | | | | |
|---|---|---|---|---|
| వార్త | స్త్రీ | వాల్తేరు | బంగాళాలో | బంధింపబడిరి |
| ఘాటుతో | తక్షణం | రావలెను. | ఆలస్యము | వద్దు |

సుందరరావు.

తరువాత నాయువకుం డెక్కడికో పోయెను.

అక్కడ బంగాళాలో బంధించబడిన సుందరరావుగారును కమలయు నిట్లు

మాట్లాడుచుండిరి.

కమల—ఆర్తత్రాణపరాయణుడగు నారాయణుండు మిమ్ముల ను పంపి నామాన ప్రాణములను గాపాడెను. నాకొరకు తమరు రాత్రింబగళ్ళు శ్రమపడుచున్నారు. మీకును ఆశ్రీహరి అచిరకాలములోనే గొప్పమేలును చేయును.

సుం—నాశ్రమ కేమిగాని నీవు వానికెట్లు లభ్యపడితివి?

కమల—తొలుదొల్త వాడు మీ వేషమును ధరించి మీ నామము చెప్పి యిట్లనియె. "అమ్మాయీ! నీవీరాత్రి యిక్కడనుండగూడదు. దుర్మార్గులు నీభర్తను జంపినవారు వచ్చి నిన్ను దీసికొనిపోయి బలవంతముగా వివాహముచేసికొను తలంపుతో నుండిరని తెలియవచ్చినది. ఈరాత్రి యిక్కడనుంచిపోయి వేరొకచోట గూఢముగ నుండని యెడల తప్పక నీకు మానహానియు నాకు కార్యహానియు వచ్చును. దానివల్ల నేను కేసు పట్టుకొనేను"—

సుంద—తరువాత?

కమ—అంత నేను వానితో "అయ్యో! తండ్రీ! ఈవిచారసాగరమునే తరించలేకుండిన నాకీయాపత్తుదప్పుటెట్లు? నాకు దిక్కెవ్వరు? నేనేకాకిని. నన్ను రక్షించుభారమును మీరే యోచించవలెనుగాని వేరు దిక్కులేదు" అనెను. అంత వాని కారునుదీసికొని వచ్చి నన్ని బంగాళాలో యీరాత్రి దాచియుంచి తెల్లవారినతర్వాత మాతోటపల్లి పంపుదునని చెప్పెను. నేను వాని ఆలోచన బాగున్నదనియు, నిష్కల్మషముగ చెప్పెననియు గ్రహించి, కారులో గూర్చుండితిని. వాడంత యీబంగాళాలో నన్ను ప్రవేశపెట్టి, నాకు భోజనాదులను, తానే దీసికొనివచ్చిన వానికి నేననేకవందనము లర్పించి, రాబోవు యాపదను గ్రహించలేక యుంటిని. వాడంత మరల తాను రాత్రి పంటిగంటకు వచ్చి నాక్షేమ మారయుదుననియు, నాకు తోడు రక్షకభటుల పెక్కండ్రను పంపుదుననియు చెప్పి తానెక్కడికోపోయెను. క్షణములో పెక్కండ్రు యమభటులం బోలువారు ఆయుధపాణులై వచ్చి నావద్ద కూర్చుని మొదట మంచి ప్రేమాస్పదములగు వాక్యములనే చెప్పిరికాని తరువాత వారి ధోరిణిలోకి దిగి తమ యజమానుని వివాహమాడుమనియు, గోల్పోయిన యావదాస్తిని మరల నాకిచ్చుటే గాక నన్ను ఈదొంగలకెల్ల రాణిగా చేయుదురనే వాక్యములను సామదానభేదదండోపాయముల జెప్పిరి. అంత నేను వీని మోసమును గ్రహించి, తెరతెరుయు గనుపించమి మిక్కిలి దుఃఖించి, ఆపత్కాలమున హరినామస్మరణ తప్ప వేరు శరణ్యము గనుపడమి అమహానుభావుని పాదములు హృదయపీఠిని నిశ్చలభక్తిని స్మరించుచుంటిని. తరువాత సంగతి మీకే తెలియును. తండ్రీ! నీవు నన్ను రక్షించుభారముపహించి నాకభయదాన మియ్యనియెడల నిప్పుడే మీసన్నిధానమున యసువులం బాసెదను.

సు—నీవెంతమాత్రమును భయపడకుము. నీప్రాణములకు ఏమియు భయములేదు. నాకంఠమున ప్రాణవాయువు వున్నంతవరకు నీకేమియు హానికలుగనేరదు.

అని యభయదాన మిచ్చినంతనే నేదియో ధ్వని వినవచ్చెను. తోడనే ఆ ద్వారములలో నొకటి తీయబడెను. దానిగుండా లోనికిద్దరాంగ్లేయులును, వారివెనుకనే

కొందరు రక్షకభటుల సముదాయమును ప్రవేశించిరి. రక్షకభటులు తమ యజమానుల ఆజ్ఞప్రకారము నాహ్రర్తకు బేడీలు (Hand Cups) తగిలించుట కుద్యమించునప్పు డాపత్తేదారు డాంగ్లేయునితో సంగతి క్లుప్తముగాఁ జెప్పెను. పిమ్మట వారందరును ఆచోరాగ్రేశ్వరచక్రవర్తి తమ్ము తెలివితక్కువ చక్రవర్తులక్రింద మరల నొకమారు మార్చినందుకు క్రోధరోషముల వానిని దూషించుచు, నాస్త్రీని తీసుకొని ఇంటికి పోయిరి.

పత్తేదారుడు గతరాత్రిజరిగిన సంగతులన్నియు నాయధికారులకు విన్నవించెను. అంత వారాపత్తేదారుని మనోధైర్యమును గొనియాడి, అహ్రర్తనుగురించి యిట్లనుకొనిరి. "ఈమాయలమారి కిరాతుని పట్టి బంధించు టెంతయు ప్రయాస. వీడసమాన ప్రజ్ఞాశాలి వలె గనపడుచుండెను. ఇట్టి ధైర్యస్థైర్యములు గల సుందరరావునే తన మాయోపాయమువలన రెండుసారులు బంధించినాడు." అని యందరును నిరుత్సాహులైరి. అంత పత్తేదారుడు వారిని హెచ్చరించి "ఇంతమాత్రమున కార్యమును వదలిపెట్టిన మనలను వారు జీవింపనిచ్చునా! కాబట్టి తగుప్రయత్నములుచేసి వ్యూహములను బన్ని పట్టి పల్లార్చవలెనుగాని వదలిపెట్టి చేతగానివానివలె యూరకుండుట పాడిగాదు. మీరుమాత్ర మీస్త్రీని తమ బంగాళాలోనే యుంచి బహుజాగరూకతతో గాపాడిన యెడల తెల్లవారిన తర్వాతంతయు చక్కపెట్టెదను." అనెను. అధికారులును నాపత్తేదారుడు చెప్పినప్రకారము అంగీకరించిరి. తరువాత నాస్త్రీని జిల్లాఅధికారి తనగృహమునకే తీసికొనిపోయి నొకగదిలో, సురక్షితముగ దాచెను.

పత్తేదారుడు వారివద్దనుంచి టర్నర్ మహాశయుని సత్రపువద్దకుబోయి నెం 4 ను గదిని పరిశీలించుటకు బోయెను. ఆగదికి పైన తాళము వేయబడెను. కాని ఆయన కనుమానము నివర్తించలేదు. గుమాస్తావద్దకుబోయి తాళమునుదెచ్చి ద్వారములను దెరచి లోనికిపోయి చూచెను. అందెవ్వరును లేరు. చిత్తుకాగితపు ముక్కలును, కాల్చినచుట్ట, బీడి, సిగరెట్ల ముక్కలును, అగ్గిపుల్లలును మాత్రముగలవు. కాని వసారాలో నొకమూలలో నొకవుత్తరం పడియుండెను. దానిని పత్తేదారుడెత్తి విప్పి లోన జదివికొనెను. తోడనే ముఖము కళలు మారిపోయినవి. నిరుత్సాహము మెండగుచుండెను. వేడినిట్టూర్పులు తరుచు వచ్చుచుండెను. ఎట్టకేలకు చెదరినహృదయమును పదిలపరచుకొని, నాజాబును గుప్తపరచి జిల్లాయధికారియొద్దకుఁ బోయెను. వెంటనే నాయధికారి బైటకువచ్చి సుందరావుగారిని కూర్చుండ నియోగించి సంగతి చెప్పుమని కోరెను. సుందరావుగారీక్రింది విధముగా చెప్పుచుండెను.

సు—అయ్యా; నేను మీవద్ద శలవుదీసికొని సత్రపునకుబోయి నెం 4 రు గదిని పరిశోధించితిని.

జి-అ—అందులో నెవరున్నారు?

సు—ఎవరును లేరు. గదికి తాళము వేయబడియుండెను. నేను తాళమును దెప్పించి గది తీయించి లోనికి వెళ్ళిచూడగా నీయుత్తరమందు దొరికినది,

జి-అ—వీది చదవండి.

సు—చిత్తము. అనిఇట్లు చదువ నారంభించెను.

ప్రియమైన సుందరావుగార్కి—

తమ రీకార్యములో దిగి పనిచేయునప్పటినుంచియు నాశక్తిసామర్థ్యములు చూచియే యుందురు. ఈభయంకర చోరాగ్రేసరచక్రవర్తిని పట్టుటంత సులభముగాదని మీకును మీయధికారులకును తెలిసియేయున్నది. ఇదివరకు రెండుపర్యాయములు మీరు నాచే జిక్కినప్పటికిని మీకును నాకును గలస్నేహ మాలోచించి క్షమించి ప్రాణహానిచేయక వదలితిని. ఈసారి నా యుద్యమమున కడ్డువచ్చిరేని తప్పక ప్రాణహాని చేయవలసి వచ్చునేమో యని ఆలోచించుచుంటిని. కాబట్టి యోచించుకొనుడు. కార్యము మించిన తర్వాత ఏమి ఆలోచించినను కార్యములేదు. జిల్లాఅధికారియింట దాచిన స్త్రీని యీరాత్రి తప్పక దీసికొనిపోయి వివాహము చేసికొందును. నీవుమాత్ర మందు జోక్యముకలుగజేసికొనవద్దు. ప్రాణహాని తప్పదు. నిశ్చయము.

ఇట్లు

మకాం
టర్నర్ సత్రవున
నెం 4 రు గది

భయంకర చోరాగ్రేసరచక్రవర్తి.

జి-అ—బాగుబాగు. వీనికి మన మనుకొనినమాట లెట్లు తెలిసినవి ?

సు—వాని గూఢచారులు మనచుట్టును గలరు. వారిమూలమున తెలిసినవి—

జి-అ—ఈ రాత్రి కమలను కాపాడు టెట్లు ?

సు—ఏమియు భయములేదు. వాడిట్లు వ్రాసినను మీబంగాళాకు వచ్చుటకు వాడి గుండె తాళునా ?

జి-అ—ఇట్టి లేఖలను వ్రాయువాని కట్టిపని లెక్కా ? అయినను కర్తవ్య మేమి ?

సు—మీబంగాళాచుట్టు రక్షకభటులను కాపలా పెట్టి వారిని గంటగంటకు తనిఖీ చేయునట్లు సబ్ యిన్‌స్పెక్టరుల కాజ్ఞ ఇచ్చెదను. నేను మధ్యమధ్య వచ్చి వాళ్ళను తనిఖీచేసి కమలక్షేమమును కనుగొందును. ఈరాత్రియే గడ్డుది. ఈరాత్రి యెవరినైనా తప్పక బంధించెదను. లేదా ప్రాణముల నపహరింతును.

జి-అ—"మంచిది, అట్లేచేయుము" అని వారిద్దరును ప్రసంగములను గట్టిపెట్టి వెడలిపోయిరి.

---

## 13 వ ప్రకరణము.

### (గుండుదెబ్బ)

నాటిరాత్రి సుమారు పదిగంటల కిద్దరుపురుషులు జిల్లాయధికారిగృహము వెనుకతట్టున నిట్లు ప్రసంగించుచుండిరి.

ప్ర—అయ్యా నాకొక యుపకారమును జేయ ప్రార్థించుచున్నాను.

ద్వి—మీ రెవరు ?

ప్ర—యదార్థమును జెప్పుమనెదరా ?

ద్వి—అన్యథా వద్దు.

ప్ర—చిత్తము యిట్లు దయచేయుడు (అని చెవులో నేదియో చెప్పెను) అంత నొక్కమారా ద్వితీయునకు రొమ్ము ఝల్లుమనియెను. నోట మాటరాలేదు. వెర్రి చూపులను జూచ మొదలిడుచుండెను. అంత నా ప్రథము డిట్లు మాట్లాడెను.

ప్ర—ఏమియు మాట్లాడ కట్లు జూచెదరేమి! హానేమియు రాదు.

ద్వి—హాని లేకపోవు టెట్లు! నా యుద్యోగము పోదా?

ప్ర—పోయినను ఫరవాలేదు. ఇదుగో యీ అయిదువేలరూపాయిలు పుచ్చుకొనుము. వీనితో మీ యుద్యోగము పోయినను వర్తక వ్యాపారములు పెట్టుకొని సుఖముగా జీవించవచ్చును. అని వాని చేతిలో 5 వేలురూపాయిల నోట్లను బెట్టెను. అంత ద్రవ్యము వానిజీవితములో నెప్పుడును జూడని హేతువుచేతను, తన యాద్విజీవితపు నౌకరీపోయినను తా నా ద్రవ్యముతో చిరకాలముజీవించ వచ్చుననియు యెంచి ఆ ద్వితీయుం డా ప్రథమున కుపకారముచేయుట కంగీకరించి, వానికి తగు సలహాను కార్యానుకూలముగఁ జెప్పి తా నా ద్రవ్యమును భద్రముగ గుప్తపరచి వానిని వాని స్నేహితుని నొక గదిలోనికిఁ బంపి యక్కడ కాచియుండు డని చెప్పి తానెక్కడికో ప్రభువువద్ద శలవుదీసికొని పోయెను.

తరువాత పోలీసుఘాటు జిల్లాధికారి బంగాళాచుట్టు కాపలా కాయుటకు వచ్చెను. వారిని సబ్ యిన్ స్పెక్టర్లు తగు స్థలములలో నుండునట్లాజ్ఞాపించి వారిని కడు నప్రమత్తులై యుండు డని హెచ్చరించుచుండిరి. వారును, సుందరరావుగారును, జిల్లా యధికారియువచ్చి తని కేమి చేయుదురోనే భయముచే గడు జాగరూకతతో నుండిరి. రాత్రి పండ్రెండు గంటలు దాటెను. రక్షకభటుల కావలింత లారంభమై నిద్రాదేవ తావహించుచుండెను. చేతులనుండి తుపాకులు పట్టుత్వము తగ్గుచుండుటచే జారి తమంత నవి పడిపోవుచుండెను.

కమలను జిల్లాయధికారిపరున్న గదిప్రక్కను వేరొకగదిలో పరుండ బెట్టిరి. ఆ గదికి తూర్పున వేరొక చిన్నగది గలదు. దానిలో దొరగారి సామానులు గలవు. (Store Room) ఈకొట్టుగదికిని కమల పరున్నగదికిని యొక చిన్న ద్వారము గలదు. కమల పరున్న గదికిని బైటికిని మరియొక ద్వారము గలదు. కమల హరినామస్మరణ చేసి, అలసి గాఢనిద్రను పొందెను. నాటిరేయిజిల్లా యధికారియు మిక్కిలి జాగరూకతతోనే యుండెను. పంటిగంట దాటినది. సుందరరావుగా రువచ్చి రక్షకభటులను తనిఖీ చేయుచుండెను. రక్షకభటు లొక్కుమ్మడి తమ నిద్రదేవతలను ఆవలకు ద్రోలి జాగరూకతతో నున్నట్లు నటించుచుండిరి.

అంత పత్తేదారుడు వారి కుత్సాహమును గలిగించి తాను జిల్లాయధికారి పడక గదియొద్దకుబోయి ఆయనను లేపి, వారిద్దరును గలసి కమలపరున్న గదియొద్దకుబోయి ఆమె సురక్షితముగ నిద్రించుచున్నందుకు కడుసంతసించి, మరల నాగదిని బంధించి బైటికివచ్చి నిట్లు ప్రసంగించుకొనిరి.

జి-అ—ఇంతవరకును నెట్లో గాపాడితిమి. ముందెట్లో తెలియదు.

ప—"ఏమియు ఫరవాలేదు. నేను నప్రమత్తతతో నుండెదను. మీరుపోయి పరుండుడు." అని ఆయనవద్ద శలవుదీసికొని తానెక్కడికో పోయెను. జిల్లా అధి కారియు తనగదిలోనికి బోయి పరుండెను. ఆయింటికి మూడుతట్ల మాత్రమే రక్షక భటుల నుంచిరి. నాలుగవతట్టు ప్రహరీగోడ యింటిగోడకు మిక్కిలి దగ్గరగా నుండు టచే ఆమార్గమున వచ్చుటకును పోవుటకును సౌకర్యముగా లేదని మానివేసిరి.

తరువాత కొంతసేపటికి కొట్టు గదితలుపులు తెరువబడెను. (Store Room)· దానిలోనుండి యిద్దరు యువకులు కమల నిద్రించు గదిలో ప్రవేశించిరి, పాప మాయమ అతి గాఢనిద్రలో మునిగినట్లు వారు గ్రహించిరి. వెంటనే వారిలో నొకడు తన చొక్కాయిజేబులోనుండి యొక సీసానుదీసి, దానిలోనుండు ద్రావకము నొకగుడ్డ పీలికమీద బోసి కమల నాసికారంధ్రమువద్ద పెట్టిరి. కొంత సేపట్లు వారు ఆమెను పరిశీలించి, యిటునటు దొర్లించి, బైటబంధించిన తలుపును పైకెత్తి యావల నిశ్శబ్దముగ బెట్టి కమలను యిద్దరును మోసికొని ప్రయాసతో గోడదాటించి. అదివరకే సిద్ధముగా నున్న యెద్దుబండిలో కమలను పరుండబెట్టి వారిద్దరును వెనుక నొకరును ముందొకడును గూర్చుండి బండిని దోలుచుండిరి. బండి ముందున్నవాడు బండిని వడివడిగానే దోలు చుండెను. బండి బంగాళానుండి సుమారు ఫర్లాంగుదూరము పోయెను.

అహా! దుర్మార్గుల దుర్మార్గ మెంత ప్రబలుచుండెను. ఇట్టి పురుషులు పూర్వ మున శ్రీరాములవారి కాలమున వానిచేత హతులైన రావణాది రాక్షసుల వంశీకులై నట్లు దోచుచున్నది. వీరికి భూతదయ నినుమంతయేని లేదు. పూర్వము యీరాక్షస బాధకు యోర్వలేక సాధుజనులు ఆశ్రీహరిని ప్రార్థింప శ్రీరామావతారములు మొదలగు యవతారములను దాల్చి దుష్టులను ద్రుంచినట్లు పురాణములు ఘోషించుచుండెను. ప్రస్తుతముగూడ సాధుసజ్జనులందరుగలసి నిశ్చలభక్తిని ప్రార్థన చేసినయెడల మరల మహా విష్ణువు ఏదైన యవతారమెత్తి యిట్టి దుండగీడుల దుండగము అణంచకుండునా? అయి నను యీవిశ్వమునగల పిపీలికాది బ్రహ్మ పర్యంతము మహావిష్ణువునకు సమానమె. బలవంతులు బలహీనులను నొక్కొక్కప్పుడు హింసించినను వారికి తగుశిక్షలను తగు సమయములలో విధించునుగాని యూరకుండడు. ఇట్లే విశ్వభారమంతయు తన భుజ స్కంధమున బెట్టికొని పాలించుచుండును. కాబట్టి నీయబల నెట్లు రక్షించునో చూతము.

అట్లాబండి పోయిపోయి యొకసందున ప్రవేశించుటకు నొక వీధిమలుపు తిరుగు చుండెను. అక్కడికి వారిగమ్యస్థానము దూరములేనట్లు వారి ముఖచర్యలవలన దెలియు చున్నది. వారు తమ యీప్సితి మీడేరినందుకున్ను యధికారుల కండ్లలో దుమ్ముకొట్టి నందులకున్ను మిక్కిలి సంతసించుచుండిరి. తమ యదృష్టదేవతను పలుమారులు గొని యాడుచుండిరి. బండివెనుకనున్న యువకుడు తెల్లవారుచున్నదనియు తన్నెవరేని జూచి ఆనవాలుపట్టుదురేమోయనియు నెంచి ముఖముమీద బట్టగప్పికొని ఆ స్పృహలేక పడి యున్న కమల ప్రక్కనేపరుండెను.

ఆవీధిమలుపుదాటుసమయము వచ్చినది. ఎక్కడనుండియోగాని "రివ్వు" మని

ధ్వనితో రెండు తుపాకిగుండ్లువచ్చి కాళ్లుగ్రేలాడవేసికొని బండితోలువాని నీలమండ లకు తగిలెను. అంతవాడు పెద్దబొబ్బతో "గుండుదెబ్బ—బహుగాఢము వచ్చితిని—ప్రాణములపై యాశలేదు_నాకొరకు విచారించకు ప్రాణములను గాపాడికొనుము." అని శోకవిహ్వలహృదయుడై నొక్కిపెట్టున నేలంగూలెను. తోడనే బండిలోనున్న యువకుడు క్షణములో నదృశ్యుడైపోయెను.

క్షణములో పోలీసువారు ఆబండిని చుట్టువేసిరి. జనులు తండోపతండములుగ మూగు చుండిరి. పత్తేదారుడును జిల్లాయధికారియు పోలీసు సూపరింటెండెంటుగారును వచ్చి ఆపడిపోయినవానిని ఆసుపత్రికి దీసికొనిపొమ్మని యాజ్ఞాపించి, కమలను తమకారు మీద దీసికొని పోయిరి.

---

## 14 వ ప్రకరణము

---

### ఇట్లనే బందోబస్తు చేసినాడు

జిల్లాయధికారి సివిలుసర్జనుకు వర్తమానమంపి మత్తుమందుచే మైకము గప్పిపడి యున్న నాస్త్రీకి తగుచికిత్సలను త్వరలో చేయించిన నామె స్వస్థతనొంది తనకష్టము లను దలంచుకొని దుఃఖించు కమల నోదార్చి వారిట్లు సంభాషించుకొనిరి.

జి-అ—సుందరావుగారు! ఈమెను దీసికొనిపోవునట్లు ఎలాగున గ్రహించితిరి?

ప—మనమిద్దరమును రాత్రి ఆమెవద్దకుఁబోయి చూచి ఆమె సుఖముగా నుండుట గ్రహించి వెడలిపోతిమిగదా?

జి-అ—అవును. తరువాత నేనుపోయి పరుంటిని.

ప—అదియు నాకు తెలియును. నేనంత మనరక్షక బృందమెట్లున్నదో యని పరీ క్షించుటకు నొకచిన్న యెత్తువేసితిని. దాని వల్ల కార్యము భగ్నమైనదనియెంచి, నతి త్వరితముగ రోడ్డుగుండా బోతిని.

జి-అ—అదేమి?

ప—నేను మారువేషమున రక్షకభటులులేని తావుననుండి గోడదాటి లోనికి దుమికితిని.

జి-అ—మిమ్ముల నెవరును జూడలేదా?

ప—చూడలేకపోవుటేకాదు, వారికి స్మారకములులేవనియే చెప్పవచ్చును.

జి-అ—ఎట్లు?

ప—నేనంత మెల్లన కమలపరున్న గదియొద్దకుబోయి తలుపు రంధ్రములగుండా చూచితిని. కాని ఆమె నాకు గనిపించలేదు. నాసందేహమును నివర్తించుటకు నేను తలుపురంధ్రముల వద్ద చెవియొగ్గి లోపలధ్వనేమేని వచ్చునేమో యని నిదానించితిని. గాని యేమియును వినిపించలేదు. నేనంత కార్యము భగ్నమైనదని చింతించి అతిత్వరిత ముగ వీధిమార్గమున రక్షకభటుల ముందర నుండి పోతిని. అప్పుడు భటుల యవస్థను

చెప్పవలసికాకుండెను. తమతమఆయుధములు గోడకు శేరవైచి తమ కళేబరములను వాని ప్రక్కనే పడవేసి స్మారకములులేక నిద్రించుచుండిరి. అట్టిస్థితిలో నున్నవారు నన్ను గాదుగదా ఆవార్తను గూడ నిశ్లే వదలియుందురని నేను తొందరపడి పోతిని.

జి-అ—ఆశ్చర్య మాశ్చర్యము! ఎట్టి సేవకులు? వీరలను నమ్మిన కార్యములగునా? తరువాత?

ప—నే నంత నొకరాజబాటను పోతిని.

నూ—తరువాత ?

ప—నేనట్లు వాయువేగమున నాదారిని పోవుచుండగా సుమారు నూరుగజముల దూరమున నొకబండియు దానితో నొక స్త్రీకళేబరమును, దానిప్రక్కనే యొక యువకుడు గూర్చునియుండుట దిలకించి, యించుక యనుమానించి, చేతనున్న దుర్భిణి యంత్రమును దీసి నిదానించి చూచితిని గాని నాకాస్త్రీ కదలక మెదలక మృత కళేబరమువలె బండిలో పరున్నందున నాకనుమానము వృద్ధియై ఆ వార్తకములకు మత్తుమందు యిచ్చిన హేతువుచే కమలస్థితి యీలాగునవుండునని దృఢ నిశ్చయుండనై ఐనను తొందరపడగూడదని యెంచి వారివెంట కొంతదూరముపోయి, నన్ను అనుమానింతురని యెంచి పక్కసందులోనుంచి రోడ్డుమీద కడ్డమువచ్చితిని.

జి-అ—తరువాత!

ప—నేనట్లు సందుతిరిగి వచ్చునంతలో బండి తోలువానికి యుత్సాహమును గలుగ జేసి తొరగతోలుమని హెచ్చరించి తాను ముఖముమీద బట్ట కప్పుకొని ఆస్త్రీ పక్కలో పరుండెను. అది నాకంటబడినది. అంత నాయనుమానము ద్విగుణీకృత మయ్యెను.

నూ—వాడట్లెందుకు చేసెను?

ప—తన్నెవరైన జూతురని.

జి-అ—పిమ్మట?

ప—నేనంత అపరున్నవాడే భయంకర చోరాగ్రేశ్వర చక్రవర్తియనియు. యీ నాటకము తప్పక ఈదెబ్బతో ముగియుననియు, యెంచి, వానికి గురిగాచూచి శిలమం డలకు కొడతామని యెంచితినిగాని కమలకు తగులునేమో యని యెంచితిని. గాని వేరు తెరవేదియు గానిపించమి సరిగా గురిచూచి దైవముమీద భారమువైచి కొట్టితిని. కాని బండివేగముగా పోవుటచే నేనుచూచిన గురితప్పి, కాళ్ళక్రిందకు వ్రేలాడవేసి త్వరగాతోలుచున్న బండివానికి తగిలెను. వాడంత మొదలు నరుకబడిన వృక్షమువలె క్రిందబడెను. వాడేవియో చెప్పెనుగాని దూరమున నుండుటచే వినుపించలేదు. నేను వాయువేగముగ నాబండియొద్దకు పోవుసరికి వాడెక్కడికో పలాయనమయ్యెను.

నూ—బాగుబాగు! మిక్కిలి నిపుణతతో చక్కబెట్టితివి.

జి-అ—ఆ హంతకు లీగృహమెట్లు ప్రవేశించిరి!

ప—మీ బట్లరే బందోబస్తుచేసినాడు.

జి-అ—అదెట్లు!

ప—"ధనమూలం మిదంజగత్" నిగదా లోకోక్తి. చేతిలో తెల్లనిసుంకములు పడుటతోనే యెట్టి నమ్మకమైన సేవకులును క్షణములో విశ్వాసహీనులై తమయజమానులను సహితము ప్రాణహాని చేయుటకు వెనుదీయరు.

జీ-అ—అవునుగాని రాత్రి వాస్వంత నౌకరులను యెవరిని యిక్కడవుంచలేదు.

ప—అదియే ప్రమాదము. వారు చేయవలసిన పని చేసియే వెడలిరని దోచుచున్నది. అయినను మీ బట్లరును పిలిపించిన సందేహానివృత్తి చేయుదును.

జీ-అ—"బాగున్నది. ఇట్టిద్రోహులకు తగుశిక్షవిధించినగాని యితరులకుబుద్ధిరాదు" అని తనబట్లరును బిగ్గరగా పిలిచెను. వాడంత నతిత్వరితముగవచ్చి వారిమ్రోల నిలుచుండెను. వానిముఖచర్యను బట్టిచూడగా దోషిగానే గనుపించుటచే వానినిదూరముగ పరీక్షించవలసి వచ్చెను. అంత నాపత్తేదారు డిట్లు ప్రశ్నించెను.

ప—ఏమోయి! రాత్రిచేరమెంత?

బ—చిత్తము నాకేమియు నరమగుటలేదు.

ప—కేబునిండిన తర్వాత అర్థమగునెట్లు!

బ—బాబు తమరేమి శలవిచ్చినను సరేగాని ఇందులో నేనేమియు నెరుగను.

ప—ఎందులో ?

బ—ఈస్త్రీకేసులోనండి.

ప—ఏస్త్రీ కేసు ?

బ—రాత్రి మాదొరగారియంట్లో వుంచిన స్త్రీ కేసు.

ప—దానివిషయమై నిన్నెవరడిగిరి ?

బ—తమరే.

ప—నేనట్లడగలేదే. ఆమె సురక్షితముగా యిక్కడుండగా నిన్ను నే నడుగుదునా ?

బ—చిత్తము. నే నట్లూహించితిని.

ప—ఎట్లూహించితివి ?

బ—రాత్రి ఆమెను ఎవరోవచ్చి అపహరించినట్లును, అందులో నేను వారికి సహాయముచేసి వారివల్ల ధనమును పుచ్చుకొనినట్లును యూహించితిని.

ప—అది నిశ్చయము గాదా? ఈమాత్రము గ్రహించలేమా ?

బ—మీరు గ్రహింపవచ్చునుగాని అది సత్యముగాదు.

ప—సత్యముగాదని యెట్లు దృఢపరచుకొనగలవు ?

బ—నేను మనదొరగారి ఆజ్ఞప్రకారము రాత్రి తొమ్మిదిగంటలకే యింటికి పోతిని.

ప—నీవు వెళ్ళునప్పుడు కొట్టుగది తలుపులను (Store Room) దీసి వెళ్ళితివా ? బంధించి వెళ్ళితివా ?

బ—వేసి-లేదు-తీసి-బాగాజ్ఞాపకంలేదు.

ప—కంగారుపడక యోచించి చెప్పుము.

బ—బాగా జ్ఞాపకంలేదు.

ప—నీ వెవరితోను రహస్యముగ గతరాత్రిమాట్లాడలేదుగదా ?

బ—"లేదు – లేదు" అని బట్లరు తనలో నిట్లు వితర్కించ మొదలిడెను. "మాసంగ తీరుర్మార్గుడు వెనుకనుంచి గూఢముగ యాలకించెనా ? కొంపమునిగినది. నిజముచెప్పిన కారాగృహము తప్పదు. అసత్యముచెప్పి బొంకవలెను గాని కార్యము మించినది" అని దృఢనిశ్చయుడై యుండెను.

ప—నిశ్చయమేనా! యధార్థముచెప్పిన నిన్ను క్షమించివదలి వేస్తాము. బాగుగా యోచించుకొనుము.

బ—బాబు! నే నెప్పుడును అసత్యమును చెప్పను. ఈ ప్రభువుగారియొద్ద చిరకాలము నుండి పనిచేసికొనుచు దారాపుత్రాదులను పోషించుకొనుచుంటిని.

ప—అట్లనా ? వీరివద్దయెన్ని సంవత్సరములనుండి పనిచేయుచుంటివి ?

బ—సుమారు పదిసంవత్సరములనుండి...

ప—నెలకు జీతమెంత ?

బ—నలుబదిరూపాయలు.

ప—నీకు పిల్ల లెందరు ?

బ—నలుగురు—

ప—ఆడవాళ్లా ? మొగవాళ్లా ?

బ—ఒకడుమాత్రమే మగవాడు.

ప—ఆడపిల్లలకు పెండ్లి చేసితివా ?

బ—ఇద్దరు పిల్లలకు చేసితినండి.

ప—ఈకొద్ది జీతములో ఎట్లు కాలక్షేపము చేసితివి ?

బ—మీవంటి ప్రభువులవద్ద ఋణముచేసి కార్యములు చేసితినండి.

ప—అయితే నిల్వలేదా ?

బ—నిల్వఏలాగున వచ్చునండి ? ఈకరువురోజులలో కుటుంబపోషణే బహుకష్టముగా యున్నది. మాకు మడులా మాన్యములా ? రెక్కాడితే డొక్కాడును గాని వేరు ఆధారమేమియులేదు.

ప—అవును. ఆమాట యదార్థము.

అని పత్తేదారు డతిరహస్యముగ నాయధికారులతో బట్లరు గృహము తప్పక శోధించవలసి యున్నదని చెప్పి వారిని బట్లరును దీసికొని బట్లరుయింటికి బోవుచుండిరి. కాని పాప మెందుచేతనోగాని నాబట్లరునకు విచార మధికమగుచుండెను. ముఖకళలు మారిపోయెను. తానారాత్రి ప్రథమునితో చేరమాడి ఆయిదు వేలరూపాయలు పుచ్చుకొన్నప్పు డున్న సంతోష మిప్పుడులేదు. ఆయిదు వేలరూపాయలతో వర్తక వ్యాపారము జేసికొందుననే ధైర్యమిప్పు డగుపడుటలేదు. తన యిల్లు శోధించెదరనియు తాను యింటనే గుప్తపఱచిన రూపాయలనోట్లు, దొరకుననియు ఆశ్చర్య మావహించెను. ఏమి చేయగలడు? అధికారులు ప్రక్కనేయుండిరి. అందులో సుందరరావుగా రసా

ధ్యులు. ఆయనకు శరణన్నను యిట్టిస్థితిలో వదలునా యని యనుమానించునంతలో కారు బట్లరు యింటిముందర నిలచెను. అంత పత్తేదారుడు మొదలగువారింట ప్రవేశించి పరిశోధించ మొదలుపెట్టిరి. తోడనే 5 వెయ్యిరూపాయలనోట్లు శ్రమలేకుండగనే దొరకెను. పిమ్మట బట్లరును ప్రశ్నింపగా వాడు నిరుత్తరుడయ్యెను. తోడనే వానిని బంధించిరి.

---

## 15 వ ప్రకరణము.

---

### పశ్చాత్తాపము.

భయంకరచోరాగ్రేసర చక్రవర్తి సముద్రమున నొక యినుకతిన్నెపై గూర్చుని దీర్ఘవిచారాంబుధిని మునింగినవానివలె దోచుచుండెను. సముద్రతరంగములను మించు శోకతరంగములచే నాతని నిరుత్సాహుడయ్యెనని చెప్పక తప్పదు. వాడు తన విస్వాసమగు మిత్రుడు కల్పితముగా గుండుదెబ్బకుపాలై పట్టుబడెనని విచారించుచు తనజీవితముపైగూడ విరక్తుడగుచుండెనని దోచుచుండెను. వాని కంటినీళ్ళు బొటబొట కారి సముద్రజలములతో గలయుచుండెను. నోటమాట వచ్చుటలేదు. వేడినిట్టూర్పులు మిక్కుటమగుచుండెను. అహా! తుదకెట్లు సంభవించినది. శౌర్యగాంభీర్యాది సద్గుణములను మాయ పితరులను బోలు నత్తమామల సంరక్షణలో చిరకాలము రాజభోగముల ననుభవించి యిక్కట్టన్నమాటను దెలిసికొనలేక యున్న నాకెట్టి విపత్తులు వచ్చినవి! జననీజనకులు శైశవముననే గతించిరి. వారి బోలు కాపాడి రక్షించు దుర్గాప్రతాపులను గోల్పోతిని. చరస్థిరాస్తులంతకన్న మున్నే మన్నయినవి. ప్రాణములకంటె నధికమగు ప్రాణమిత్రుడు దాదా మరణించెననియే చెప్పవచ్చును. చూడచుట్టమును మ్రొక్క దైవమును లేకయుంటిని. దుర్మార్గుడను, క్రూరుడను, పాపిని, ద్రోహిని, హా! తండ్రీ! దీనబంధూ? దయాళూ! రక్షించు. రక్షించు. నన్ను గాపాడ కంకణముగట్టికొనుము. నావంశము మిత్రులు పూర్తిగ నశించిరి. నిర్మూలింపబడిరి. నేనును నశింపయుంటిని. ఛీ ఛీ! ఎట్టి అశ్లీలము ననంటిని మావంశనాశనకరుడైన పత్తేదారుని- సుందరరావును మాపట్ల తోకచుక్కను పట్టిపల్లార్చి బదభ్రష్టునిచేసి ముప్పతిప్పలుపెట్టి బంధునాశనముచేసి వానిని ముక్కముక్కలుగగోసి కాకులకును గ్రద్దలకును విందుచేసినగాని యీ నా శరీరమునం గల కోపాగ్ని చల్లారదు. అదెట్లు కొనసాగును? ఉపాయముననే కార్యము సాధించవలెను. గాని వేరొండు తెర వగపడదు. దేహబలమునకంటె బుద్ధిబల మున్నతమైనది గదా. బుద్ధిబలమున సాధించలేని కార్యములు లేవు. కాబట్టి దానిని నమ్మి కార్యసాధన కుపక్రమించిన నాయీప్సిత మీడేరును. ఇంతకును ముందుచేయవలసిన కార్యమేది? మిత్రసంరక్షణా? శత్రు నిర్మూలమా? మిత్రసంరక్షణ యిప్పు డసంభవమనియే తోచుచున్నది. యెట్లయిన యిప్పుడు దాదా కించుకేని స్వస్తతగాలేదు. వానిని రక్షించగలను. కాని రక్షించి యెట్లు గూఢముగ గాపాడుదును? కాబట్టి దేశకాల పరిస్థితుల ననుసరించి వానినప్పు డప్పుడు దర్శించి

యోగక్షేమముల నారయుచుండుటే యుత్తమోత్తమమైన పని యని దోచుచున్నది. అట్లుగాదేని వానిని రక్షించలేకపోవుటయే గాక మదీయ ప్రాణహానియు తటస్థించును. కావున కార్యములలో తొందర జెందగూడదు. ఈరోజున దాదా వద్దకుఁబోయి సంగతి సాంతముగ చెప్పి వానియనుమతిని పొందెదను. వాడును బుద్ధిమంతుడుగదా! మాకు హానివచ్చునని యాతనికిదోచిన నన్నేపనికిగాని ప్రోత్సహించడు. అట్లు వానితో ఆలోచించిన నన్నుస్వార్థపరుడననియు పరోపకారబుద్ధిలేనివాడననియుయోచించునేమో! కాదుకాదు. అట్లెంచడు. అతడు దూరదృష్టి గలవాడు. నామీదప్రేమ యొక్కువ. సుతవాత్సల్యమున జూచి తగు యోచనలను జెప్పునుగాని అన్యథా 'యోచించడు. కాబట్టి యికశత్రునిర్మూలను మిగిలియున్నది. పుత్రమిత్రబాంధవకళత్రములతో నశింప జేసినగాని నాకు మనశ్శాంతి గలుగదు. అదెట్లు సమకూడును? దాదాతో నాలోచించి చేయుదును. ప్రొద్దుగ్రుంకినదికదా ఇప్పుడు చికిత్సాలయమునం గలయధికారులు తమ తమ ఇండ్లకుం బోవుదురు. కొద్దిమంది సేవకు లున్నను వారిని శీఘ్రకాలములోనే వశపర్చుకొనవచ్చును. కాబట్టి యీవిచారసాగరమును బోలి సముద్రతీరమును విడిచి పోవుటేమంచిది." అని చక్రవర్తి యోచించి నిరుప్రక్కల నెవరైనవచ్చి తన్ను గుర్తింతురేమో యని బహు జాగరూకతతో నాగాధాంధకారమునం బడి చికిత్సాలయము వైపునకు బోవనుండెను. వాడట్లు పోయి దాదా యుండుచోటుకొరకుగాబోలు వెదకుచుండెను.

దాదాను చికిత్సాలయమున శస్త్రమందిరములో బెట్టిరి. వానికి మిక్కుటమగు గుండుదెబ్బ కతమున మరణవేదన యాసన్నమైనను, అభిషగ్వరశిఖామణి తన నైపుణ్యమునంతయు తెల్లమగునట్లు వానికి తగు సమయములో తగుచికిత్సలను చేయుటచేతను, యిష్టమగు నాహారపదార్థములు నిచ్చుటచేతను క్రమక్రమముగ బాధలు కొన్ని తగ్గుచుండుటచేతను మరణవేదన మరచి, స్నేహవాత్సల్యమునతో లేక పెంచిన ప్రేమచేతనో గాని చక్రవర్తిని గురించి విలపింపసాగెను. అయ్యో పసిపాపడు! ధూర్తుడు!ఆరితేరిన వాడు! ఏకాకి సమస్తభోగముల ననుభవించినవాడు! మాతాపితలు లేనివాడు!నమ్మిన బంటుసయితము గానరాడు! నేనా ఈగతిని యుంటిని. ప్రాణములపై యాశలేదనియే తోచుచున్నది. ఒకవేళ జీవించినను నాజీవితము నిష్ప్రయోజనమైనది. దుఃఖకరమయినది. వానికేమియు సహాయముచేయజాలను సరికదా వాడు తగనిబాధ నాతో యనుభవింపవలసియుండును. అమ్మో! ఆదుర్మార్గుడెంత పాపము గట్టుకొనెను. నే నెంత దురదృష్టవంతుడను! మాయుద్యమములో కృతార్థులమైతిమని సంతసించు మాహృదయములను క్షణములోతగని విచారమున ముంచివేసెను. అహాహా! శరీరములు క్షణభంగురములన్న మాట అసత్యమా? ఆ క్రూరుఁడు సుందరావును మట్టుబెట్టుట చాలాకష్టము. వాడజేయుడు. వానికి ప్రాణములమీఁదాశలేదు. అట్టివానితో వ్యవహారము త్రాచుపాముతో చెలగాటమువంటిది. అఖండులు. అజేయులని పేరుగాంచిన దుర్గా ప్రతాపులు సయితము మడసిరి. మేమెంత!" అని యోచించుకొనుచు కుడిప్రక్కకు దిరిగి పరుండెను.

ఇంతలో చక్రవర్తి చికిత్సాలయపు సేవకుని కొక రూపాయిని చేతబెట్టి దాదా

పరున్న మంచమువద్దకు మారువేషమునవచ్చి, వానిజూచి కండ్లనీరు దెచ్చుకొని మర
అది విచారించుటకు తగు సమయము గాదని ధయిర్యము తెచ్చుకొని, గద్గదస్వరమున
దాదారొమ్ముడలుమీద చెయ్యివేసి

చ—మిత్రమా? ఎట్లున్నది?

దా—బాబా! వచ్చితివా! నీరాకేయింతవరకును తలచుకొని యిప్పుడే పరుంటిని.

చ—నీ వంట్లో ఎలావున్నది?

దా—కొంచెము క్షేమమే గాని—

చ—"కాని" అనుచుంటివేమి?

దా—ఏమియూ లేదు నాయనా!

చ—కారణము లేక "కాని" యన్నమాటవచ్చునా? నీహృదయమునంగల కోరిక
చెప్పుము. నాశక్తివంచనలేకుండ దాని నీడేర్తును.

దా—నీ వంటివాడవేయగుదువు గాని తగు సమయమునకై వేచియుండవలెను
గాని త్వరపడరాదు.

చ—అవునుగాని ప్రస్తుతము నీక్షేమమునకును, కార్యసాధనమునకును సంబంధము
లేదుగదా?

దా—నిశ్చయమేగాని నాకాదుర్మార్గుడు ఔడ తెగని దుఃఖమును దెచ్చిపెట్టుటేగాక
జీవితాశలేకుండ చేసినాడు.

చ—నిజము పల్కితివి. అట్టిక్రూరుని సపుత్రమిత్రకళత్రబాంధవమిత్రులతో మట్టు
బెట్టుట నాబోటివానికి సహజకృత్యముగాదా.?

దా—అవునుగాని తగు సమయమునకై వేచియుండవలెనుగాని, తొందరపడిన
కార్యములు ఫలించునా? ఏ కార్యమునందు గాని ఆలోచించనిదే సఫలీకృతము లగునా?

చ—"ఆలస్యం అమృతం విషః" మ్మని గాదా లోకోక్తి. నా బంధుమిత్రులను
నాశనము చేసిన క్రూరుని వధోపాయమును త్వరలోచేయక నూరకుండుట మిత్ర
ద్రోహము కాదా?

దా—వద్దు వద్దు. ప్రస్తుతము నీ యుద్యమమును మానుము.

చ—మానుట కల్ల. క్షణమేని యూరకుండను,

దా—ఏమి చేయుదువు?

చ—వానిని మట్టుబెట్టెదను.

దా—ఎట్లు?

చ—బుద్ధిబలముచేత (అని చెవులో నేదియో చెప్పెను.)

దా—ప్రమాదముసుమా! వాడసాధ్యుఁడు. నీయెత్తులలో బడడు—

చ—ఎన్నటికిని రాదు. నా జాగ్రత్తలో నే నుండెదను.

దా—జాగ్రత్త సుమా!

చ—ఏమియు ఫరవాలేదు. నే ననుకున్నట్లు వానిని జయించితినా, దుర్గాప్రతాపుల
రుణము దీర్చుకొనుటయేగాక వారికన్న నేను ఘనుఁడనని యూ చెప్పుకొందును. లేక

వానిచేతిలోఁ జిచ్చితివా వారితో పాటే యగుదును.

దా—అబ్బబ్బ అట్టి యశ్లీలములను నాయొద్ద నుడువకుము. నీయిష్టప్రకారము చేయుము గాని నీవు రెండు రోజులకై నాకొకసారి వచ్చి నాక్షేమమారసి నాకు సంగతులను జెప్పుగోరెదను.

చ—అట్లే తప్పక చేతును. నీకన్న నాకెవ్వరు దిక్కు. నా విజయమును జూచి నీవే సంతోషించవలయును గాని వేరెవ్వరును లేరుగదా! కాబట్టి నీవు నిర్విచారముగా యుండి రుగ్మతను కుదిర్చికొనుము. నేబోయెద. ఆవైపునుండి యెవ్వరో వచ్చుచున్నారు

దా—"మంచిది" అనినంతనే చక్రవర్తి యక్కడనుంచి అంధకారములోనికి నిష్క్రమించెను. దాదా కొంచెము రొట్టి తిని పాలను ద్రాగి, చక్రవర్తినిగురించి యోచించుచు నిద్రబోయెను.

—:0:—

## 16 వ ప్రకరణము

### పేదరాలికి పేరంటం

చక్రవర్తిని బంధించుటకు పత్తేదారుడు వ్యూహములను బన్నుచుండెను. వాడు నివసించు స్థలములో తరుచు తాను మారువేషమున దిరుగుచుండెను. కమలను దీసికొని పోవుటకు ఆమె బంధుగులు వచ్చినను అట్టి తరుణములో ఆమెనుబంపిన కార్యమున కాటంకము వచ్చునని గాబోలు ఆమెను బంపలేదు. ప్రస్తుతము కమల తనభర్తయింటనే యుండెను. ఆమె క్షేమము దినమునకు రెండుసారులు తాను స్వయముగ వెళ్ళి కనుక్కొనుచుండెను. తన కుమార్తెకు పూర్తిగ ఆరోగ్యము కలిగిన తరువాత నామెను భర్తవద్దకు పంపివేసెను. ఇంట తాను భార్యయు తప్ప మరెవ్వరునులేరు. కొడుకు తన భార్యతో యేలూరులో తాతగారియాస్తి దఖలుపడినందున అక్కడే యుండెను. సుందరరావుగారు తన శక్తికొలది చక్రవర్తిని గురించి వాకబులు చేయుచుండెను. గాని యేమియు తెలియుటలేదు. వాడు పట్టణములోనే యుండెనుగాని పలాయనమై పోలేదని అయన గ్రహించియే యుండెను.

చక్రవర్తి మితిలేని క్రోధమున సుందరరావుగారికిని కుటుంబమునకును తగిన ప్రాయశ్చిత్తము చేయు తలంపుతో యుక్తియుక్తముగా పన్నాగములను పన్నుచుండెను. క్షణక్షణమునకు తన వేషభాషలు మార్చుచు సంచరించుచుండెను.

ఒకనాటి సాయంకాలమున సుందరరావుగారి యింటివద్ద నొక వితంతువు చాల ప్రయాసతో నిల్లనిలెను. "అమ్మా! అమ్మా! ఇంట్లో ఎవరమ్మా" అని పిలిచెను. తోడనే లక్ష్మీబాయి బైటకొచ్చి "ఎవరువారు" అని ప్రశ్నించెను. వారి కీక్రింది సంభాషణ జరిగినవి.

స్త్రీ—అమ్మా! నేనొక పేదరాలను. అన్నములేక మిక్కిలి బాధపడుచుంటిని. మూఁడు రోజులనుంచి అన్నమును జూచియే యెరుంగను. నాకొక్క కడియన్నమును బెట్టి పుణ్యము గట్టుకొనుము తల్లీ!

అ—నీదే యూరు ?

స్త్రీ—నాపుట్టిల్లు యేలూరు.

అ—ఏమి ! యేలూరా ? మీయింటిపేరు ?

స్త్రీ—నాతండ్రిగారి యింటిపేరు అవంగాలవారు. ఆయన పేరు రంగయ్య.

అ—అట్లనా ! నేనతనిని బాగా యెరుగుదును. నీ పేరు పెద్దమ్మగాదా? నీ అత్త వారియూరు ముస్తాబాదాగాదా ?

స్త్రీ—అవును తల్లీ ! మాసంగతంతా యెరుగుదువు భగవంతుడీవేళ మీవద్దకు తీసికొనివచ్చెను. దిక్కులేనివారికి దేవుడే దిక్కుగాదా? నాబోటి యనాథలకు మీబోట్లు తప్ప వేరు శరణ్యములేదు.

అ—సరి దానికేమిలే ?

స్త్రీ—అమ్మా ! ఏలూరులో తమ రెందు కున్నారు ?

అ—నాపుట్టిల్లు యేలూరే.

స్త్రీ—అలాగునా ! తల్లీ ! ఏమి దైవఘటన. నన్నిక్కడికేపంపవలెనా ? అమ్మా ! ఏలూరులో మీయిల్లెక్కడ ?

అ—మీయింటికి ఎడమప్రక్కనున్న నాలుగోయిల్లు.

స్త్రీ—అయితే తల్లీ ! నీవు జగన్నాథంపంతులుగారి కొమార్తెవా ? మనము చిన్నప్పు డాడుకొనువారముతల్లీ ! జ్ఞాపకమున్నదా ?

అ—అయ్యో! ఆరోజులన్నియు నిప్పుడే ఒకటొకటి జ్ఞాపకం వచ్చుచున్నవి. కాని ముస్తాబాదులో నీఅత్తవారు భాగ్యవంతులుకారా ?

స్త్రీ—అవును తల్లీ ! ఇప్పు డంతా పాడైపోయినది. నాతల్లి దండ్రాదులు చనిపోయిన యేడాదికి నాభర్తయు పరలోకగతుడయ్యెను. అప్పటినుంచియు జ్ఞాతులు నాఆస్తి నంతయు వశపరచుకొని నన్ని ట్లిడుమలు గుడుపుచుండిరి. నాయేకపుత్రుడు తండ్రికన్న ముందుగనే చనిపోయెను. ఏదైనతిండి కిమ్మనమని నా బావలనడిగినను వారేమియు మాట్లాడరు సరికదా తమ భార్యలను నామీదికి దెబ్బలాటకు పంపుదురు. ఇట్టివారితో తగవులాడుటకంటె ముష్టియెత్తి జీవించుట మంచిదని తలచి యిట్లు తిరుగుచుంటిని. బ్రతికినన్నాళ్ళు తిండి బట్ట కావలెనుగదా ! తల్లీ ! ఏలాగున చేయదలచెనో గాని యిప్పటికి నాకాధారమేదియు లేదు. ఈకష్టములుజూచి యెన్నొక్కప్పుడు యీపాడుపొట్టకొరకింతకష్టపడవలెనా యని యసువులంబాయుట తలంపుకలుగుచుండునుగాని ఏదియో నొక యభ్యంతరము వచ్చుచుండుటచేత నప్పటికప్పుడాయుద్యమము మానివేయుచుంటిని.

అ—చాల విచారకరమైనసంగతి. పడరాని యిడుములు పడుచుంటివి. నాకంటె నీవు చిన్నదానవు. తిండికేమిలే ! మనము బాల్యస్నేహితులము. నీకు తిండికేమియు లోటు లేదు. మాయింటనే యుందువుగాని, ఆయనతో చెప్పి యొప్పింపెదను. ఇంట్లో కాస్త సాయముగ నుందువుగాని భరవాలేదు. దుఃఖింపకుము.

స్త్రీ—నాకన్నతల్లే ! నాచిట్టితల్లే ! పుట్టింటివాళ్ళన్న నీకెంత యభిమానమమ్మా !

నీయింట్లో పనియంతయు నేనే చేయుదును. నాకింతయన్నము పెట్టుము. అంతేచాలును. నీగుమ్మమువద్ద కనిపెట్టుకుని యుందును.

●—మంచిది! అని వారిద్దరు నిష్ఠాగోష్ఠిని చాలసేపు ప్రసంగించుకొని నామెకు లక్ష్మీబాయి భోజనముపెట్టి వీధిగదిలో పరుండమని చెప్పెను. ఆమెయు చాలసేపు ప్రసంగించి మూడురోజులనుండి అన్నము లేనికారణముననో మరెందుచేతనోగాని క్షణములో నిద్రపోయెను.

కార్యముమీదపోయిన సుందర్రావుగారు రాత్రిపదిగంటలకు గృహమునకువచ్చి, భోజనముచేయుచుండగా లక్ష్మియు క్రియు క్రమముగా ఆక్రొత్తమనిషిని గురించి సిఫార్సు చేసి అందుల కాయనను గూడ యొప్పించెను. సుందర్రావుగారామూతనమనిషిని జూచి పరీక్షించెను. పద్దమ్మ తమ యజమానుల కెంతయు బహు వినయవిధేయత విశ్వాసములతో సంచరించుచుండెను. పద్దమ్మ క్షణమేని వారి గృహము వదలక సర్వదా చిన్న పని పెద్దపని చేయుచు వారియనుగ్రహమునకు పాత్రురాలై యుండెను. లక్ష్మీబాయి కామెవచ్చినప్పటినుంచియు ప్రాణములు మిక్కిలి సౌఖ్యముగా నుండెను. పొయ్యిమీదపెట్టి వండికొని తినుటతప్ప ఆమెకేమియు శ్రమే లేదు కనుకనే పద్దమ్మమీద యీగనుసైతము వాలనిచ్చుటలేదు. ఆమె దొడ్లోకి వెళ్ళి కాస్తఆలస్యముగ వచ్చిన ఆమె కొరకు పలుసార్లు పలవరించుచుండెను. పద్దమ్మకు వీధిఅరుగుమీదగదిలో మొదట చాపమీదనే పరుండవలసివచ్చినను, లక్ష్మీబాయి క్షణములో మంచము ప్రక్క తయారుచేయించి యిచ్చెను. బాల్యస్నేహవాత్సల్యమే కారణము.

---

## 17 వ ప్రకరణము.

---

### విషప్రయోగము

సుందర్రావుగారి యింటివద్ద మోటారుకార్ల యడావిడి వర్ణనాతీతముగా నుండెను. వచ్చేవైద్యులకు (Doctors) పోయేవైద్యులకు యిక్కడ తీరికలేదు. వారందరు లోనుండిబైటికి వచ్చుచు ఫరవాయుండగూడదని చెప్పుచు నేయుండిరి. సుందర్రావుగారు మాత్రము మిక్కిలి విచారముగా నుండిరనుట కేమియు సందియములేదు. వైద్యులు వచ్చుచున్నను, యింజక్షను (Injections) యిచ్చుచున్నను, ఫరవాలేదని ధైర్యము చెప్పుచున్నను ఆయనకు మాత్రమధైర్యముగ నుండియే రెండు టెలిగ్రాముఫారములను తెప్పించి, దగ్గరనుండు స్నేహితుని యొకనిని పిలచి స్థితిగతులు క్లుప్తముగా వ్రాసి తన కుమారునికిని, అల్లునికిని తంతుల నిమ్మనికోరెను. అంత నాస్నేహితుడు వాని నిట్లువ్రాసి ఆయనకిచ్చెను. కాని ఆయన చదువలేక లేఖరినే జదువుమని కోరెను. అంత లేఖరిట్లు జదివెను.—

| | |
|---|---|
| | ఎక్సుప్రెస్సు.<br>EXPRESS. |
| | గోపాలరావు. (Gopal Rao)<br>బి. యే. (B. A.)<br>ఏలూరు. (Ellore) |

| | | | |
|---|---|---|---|
| తల్లి<br>Mother | మరణశయ్యపై నున్నది<br>Death bed | తక్షణము<br>immediately | బయలుదేరు<br>Start |

సుందర్రావు వ్రాలు.

(Sd.) Sundara Rao.

| | |
|---|---|
| | ఎక్సుప్రెస్సు.<br>EXPRESS. |
| | రామారావు. (Rama Rao)<br>బి. యే. B. A. B. L., Pleader.<br>బళ్ళారి. Bellari |

| | | | |
|---|---|---|---|
| అత్తగారు<br>Mother-in-law | మరణశయ్యపై నున్నది<br>Death bed | పిల్లతో<br>Start with | రావలెను<br>Daughter |

సుందర్రావు వ్రాలు.

(Sd.) Sundara Rao.

అంత సుందర్రావుగారు వాటిమీద బహుశ్రమతో సంతకములను జేసి నౌకరుని కిచ్చి పంపెను. వాడును వాయువేగమునబోయి తంతి ఆఫీసు (Telegram Office) లో నిచ్చెను.

కొంతసేపటికి యింటిలో పెద్ద కలకలము అరంభమయ్యెను. లక్ష్మీబాయి వరుసేమియు బాగులేని కారణమున ఆమెను జూడవచ్చినవారందరు సాయముపెట్టి మంచముమీద నుంచి క్రిందికి దింపిరి. ఆమెను సర్వదా కాపాడుచుండు పద్మమ్మ రోదన ధ్వనులు హెచ్చుచుండెను. "అయ్యో? తల్లి! నా దురదృష్ట మేమని చెప్పికొందును. నేనెక్కడికి బోయిన అదియు నాకన్న ముందుగనే అక్కడ ప్రవేశించుచున్నది. అయ్యో! తండ్రీ నాకొరకైనను యీమెను బ్రతికించవా? నాకిమెరయేదిక్కు. నాబోటి

దిక్కులేని పక్షులను గాపాడువారిని మట్టుబెట్టు టేటిన్యాయము? సర్వేశ్వరా! రక్షించు రక్షించు. నేనును యీామె మార్గమునబెట్టి పోయెదను. అయ్యో! తండ్రులారా! నాయీా తల్లిని గాపాడరా! ఇంకెక్కడి తల్లి? మాయదారి జబ్బు క్షణములో వచ్చెను. ఓ అమ్మలారా! మీా కెరిగిన వైద్యముల నేకేని వున్నయెడల చెప్పి పుణ్యము గట్టి కొనుడు." అని విలపించు పద్మమ్మ దుఃఖ మాపలేకుండిరి. ఎన్నివిధముల యెవరుచెప్పి యోదార్చినను ఆమె వినక తలను గోడనుబెట్టియు, స్తంభమునుబెట్టియు చేతులతోను గొట్టికొనుచుండెను. "ఆహా! ఆమె స్వామిభక్తి" కందరును మెచ్చుకొనుచుండిరి. సేవకులందరును యీామె కాలిగోరునకు సరిపోల రనుచుండిరి. తన యజమానురాలి కొరకు కడుపునబుట్టిన కూతురువలె దుఃఖించుటేగాక ప్రాణముల సైతము గోల్పోవుటకు సంసిద్ధురాలై యుండె ననుకొనుచుండిరి. కొంత సేపటికి పద్మమ్మ పెద్దగొంతుకతో నేడ్చుచు వీధియరుగుమీాద విచారించుచు గూర్చున్న సుందరంగారి కాళ్ళపైని బడి యిట్లనియె. "బాబు! నీవిట్లు విచారించిన కార్యమేమి? నీలక్ష్మి పోవుచున్నది. ఆమెను కాపాడికొనలేవా? రక్షించుకోలేవా? విచారింతువా!"

సు—ఏమిచేయమందువు?

ప—నీవు తక్షణముపోయి పెద్దవైద్యుల నెవరినైనా పిలుచుకొనిరమ్ము. త్వరగా పొమ్ము. ఆమె భూశయ్యపైనున్నది. యొకసారామెవద్దకు రమ్ము. కంట్లోసంగతి వాకబు చేయుము. ఇట్లుగూర్చుండిన కార్యమేమి? నీలక్ష్మి యంతికాలము సమీపించినది. మరణశయ్యపై నున్నది. పోయి కడసారి దర్శనము చేసికొనుము. హా! హా! లక్ష్మి—లక్ష్మియే! ఆమెబాధను చూడలేను. చూడలేను.

సు—నేను వచ్చి ఏమిచేయగలను?

ప—అయ్యో! అట్లనెదవేమి? కడసారి ముద్దుపలుకులు వినవేమి? ఆమె ముఖకళలు మారుచున్నవి. పెద్దవైద్యులు కావలెను. జాగుచేయకు తండ్రీ! రమ్ము! రమ్ము! నా కున్మాదము హెచ్చుచున్నది.

ఈమె తొందరమాటల నాలకించి, చుట్టుప్రక్కల వారలలో కొందరు "సివిలసర్జనుగారు—సివిలసర్జనుగారు—కారుమీాద—తక్షణము — తీసుకొనిరమ్ము—" అని వారిలో వారు ప్రసంగించుకొని వాయువేగముగ సర్జనుగా రింటికిపోయి సంగతి చెప్పి ఆయనను తక్షణమువచ్చి పరీక్ష చేయుమనిరి. అంత నాయన తన కారుమీాద యొకాయొకని సుందరావుగారి యింటివద్దకు వచ్చి, లోనికిపోయి, లక్ష్మిబాయిని పరీక్షచేసి ఒక వేడినిట్లూర్పునువిడిచి, "యీామెకు ఫరవాలేదు. తీసి మంచమీాద పరుండబెట్టుడు." అని చెప్పెను. తోడనే పద్మమ్మ సంతోషము చెప్పనలవిగాదు. ఆమె యొక్కమారా భిషగర్వుని పాదములపై వ్రాలెను. చూచువారును సుందరావుగారును ఆమె ప్రేమను గొనియాడిరి. ఆమె విశ్వాస మద్వితీయమనిరి. అంత నామె వైద్యునితో నిట్లనియె—"బాబు? శ్లేష్మములు యింకను గ్రమ్మలేదుగదా?"

డా—లేదు లేదు. ఆమెకు ఫరవాలేదు—కాని గట్టయిన జబ్బు—

ప—ఆమెకిట్టి జబ్బును బెట్టుట కాసర్వేశ్వరు డెన్నిదినములనుండి యోచించెనో.

సుం—ఏమిజబ్బు?

డా—విషప్రయోగము—

ప—అమ్మబాబోయి! విషప్రయోగమే? అని లక్ష్మీబాయిమీద పడి నోరునొవ్వడి "గొల్లు" మనియెను. బాబు! జీవించునా?

డా—ఫరవాలేదు. ఇప్పుడే దాని యుద్రేకమును తగ్గించుమందు సూదిద్వారా శరీరములోనికి యెక్కింతును.

ప—ఆలస్యమువద్దు బాబు! కార్యము మించును. త్వరపడుడు—

అనునంతనే వైద్యుడు సూదిద్వారా మందు నెక్కించెను. విషప్రయోగమునకు కారణము సుందర్రావుగారు యోచించుచుండిరి. మధ్యమధ్య పద్మమ్మను ప్రశ్నించుచుండెను. పద్మమ్మ, లక్ష్మీబాయి గతరాత్రి పెరుగుపోసి తినుటతప్ప ఏమియు తినలేదని చెప్పినది. తరువాత సుమారు గంటకు లక్ష్మీబాయి మరియొకప్రక్కకు త్రిగిలి "పద్మమ్మా! మంచినీరు" అని మాట్లాడినది. తోడనే పద్మమ్మ సంతోషమునకు మేర లేదు. ఆమె కేవలము సంతోషసముద్రములో నుండెనేమోయనునట్లు నటించుచుండెను. వైద్యుడు చెప్పినప్రకారము లక్ష్మీబాయికొక గాఢమైన సోడా బుడ్డినిచ్చిరి. ఆమె దానిని త్రావిన తర్వాత కొంత తెప్పరిల్లెను. చమటలు శరీరమంతయు గప్పెను. తొల్లిటి ఆయాసము లేదు. మరికొంతసేపటికిఁ "అన్నము" అన్న మాటనాడెను. ఆమెకు అన్నము పెట్టలేదుగాని జావను బోయమని వైద్యుడు చెప్పుటచే నదియే యిచ్చిరి. అంత లక్ష్మి లేచి కూర్చుని తన స్నేహితురాలితో హితోక్తులు చెప్పుచు నిద్రపోకుండ గూర్చుండెను.

---

## 18 వ ప్రకరణము.

### పద్మమ్మ—గహాస్యము.

సుందర్రావుగారు లక్ష్మీబాయికి విషప్రయోగమును గూర్చి యోచించుచుండెను. యేలూరునుండి కొడుకును, కోడలును, బళ్ళారినుండి కూతురును అల్లుడును వచ్చి నాలుగురోజులుండి, లక్ష్మీబాయికి కులాసాగా నుండుటచే గాబోలు మరల వారివారి స్థానములకు వెడలిపోయిరి. వారు పద్మమ్మవిశ్వాసములు, ఆమె సంరక్షణను గురించి వేయినోళ్ళ ప్రసంగించుకొనుచు ఆమెమూలముననే లక్ష్మీబాయి మరణశయ్య నుండి లేచి కులాసాగా నున్నదనే సంగతులు చెప్పికొనిరి. సుందర్రావుగారికిని లక్ష్మీబాయికిని పద్మమ్మనిన పంచప్రాణములు. ఆమెకు తన యింటిపెత్తనమంతయు యిచ్చుటే గాక, ధనపెట్టెలతాళములును ఆమెకే యిచ్చిరి. ఆమె పగలంతయు యింటివ్యాపారము లను జూచి తమ యజమానులు నిద్రపోయిన తర్వాత వీధిలో తన గదిలోనికిఁ బోయి పరుండును. మరల తెల్లవారకమునుపే లేచి పాచి పనులువగైరాలు చేసి వేడినీళ్ళు మొదలగునవి తమయజమానులకు సిద్ధముచేయును. ఇట్టి సుగుణవంతురాలు శత్రువైనను యజమానులు ప్రేమించకుందురా? పద్మమ్మ యింటివారికే గాక యిరుగు పొరుగువారల

కందరకును తలలో నాలకగాయున్నది. ఆమె తన యింటిపనులన్నియు జేసినపిదప యిరుగుపొరుగు వారేమిపని చెప్పినను నిరాకరించక చేయును. ఆకారణముచేత అందరికి నిష్టురాలే.

సుందర్రావుగారు విషప్రయోగమునుగురించి లక్ష్మీబాయిని ప్రశ్నించెను. ఆమె కష్టదినములు వంటిమీదున్న కారణమున తనకట్టివి సంప్రాప్తమయ్యెనే గాని వేరు కారణము లేదనియు ఆనాడు పెరుగుమంతపై మాతవేయని కారణమున యేబల్లిరో నల్లిరో వందుపడి తన కంఠప్రమాదమును గలిగించినది కాని వేరుకారణములేదని చెప్పెను. సుందర్రావుగారును యీ సముజాయిషీతో తృప్తినొందక తన శత్రువులు తనకు పెరిగిచ్చు గొల్లదానిద్వార విషప్రయోగము చేయించిరని విశ్వసించి సారహస్యమును బైటపెట్టుటకు ప్రయత్నము చేయుచుండెను. కమల సురక్షితముగానుండెను. చక్రవర్తిజాడ లేమియు దొరుకుటలేదు. తన ప్రియమిత్రుడు దాదాకు సంభవించినకష్టమునజూచి తనకు నట్టిదేవచ్చునేమోనను భయకారణముచేత యీపట్టణమునువదలిపోయెనేమో యనియనుకొనుచుండిరి. "నిజము నిలకడమీదగాని తెలియదు. ఇప్పుడేమియు నిర్ధారణ చేయుటకు వీలులేదు. వాడంతలోనే పట్టణము విడిచిపోవునా? అంతపిరికిపంద మొట్టమొదట న్నిహత్యలు చేయగలడా? ఒకవేళ చేసినను నాకట్టిజాబులను వ్రాయ వాని గుండె తాళునా! వాడెక్కడనో ప్రస్తుత మజ్ఞాతవాసము చేయుచుండెనని దోచుచున్నది. లేనియెడల నే నెంతప్రయత్నము చేయుచున్నను నాకించుకేని ఆవోకీ దొరకనేలేదు. అయినను యీరాత్రి ప్రయత్నముచేసి తప్పక కూపీదీయుదును. అట్లు దొరకకపోయెనా వాడీ గ్రామములో ప్రస్తుతము లేడనియే చెప్పవచ్చును" అని సుందర్రావుగారు నిశ్చయించుకొని నాడు పెందలకడనే రాత్రి భోజనాదులను చేసి పద్దమ్మతో యిల్లును లక్ష్మీబాయియు జాగ్రత్తయని వప్పగించి, తానెక్కడికోగాని వెళ్ళుచుండెను. అట్లు వెళ్ళునప్పుడు లక్ష్మీబాయి "రాత్రి రారా? యని ప్రశ్నించెను! రాను రాను. గతరాత్రి పాప మెవరో కమలయింటికిబోయి ఆమెను భయపెట్టి యీ రాత్రి తప్పకామెను దీసికొనిపోయెదమని జాబును వ్రాసి గోడకు గొట్టిగట. కాబట్టి నేనామె కభయదానమిచ్చియుంటిని. ఆకారణమున యిక్కడికి రావీలులేదు. నీవును పద్దమ్మయు జాగ్రత్తగ నుండుడు" అని చెప్పి సుందర్రావుగారు తనదారిని బోయెను.

తరువాత లక్ష్మీబాయియు పద్దమ్మయు భోజనాదులను జేసి లోకాభిరామాయణములను చాలసేపటివరకు జెప్పికొని, పరుండిరి.

రాత్రి సుమారు పన్నెండు గంటలాయెను. సుందర్రావుగారి యింటిలోనుండి నొకవ్యక్తి నిశ్శబ్దముగ బైటికివచ్చి రాజబాటగుండ వడివడిగ జార్జిసార్వభౌముని చికిత్సాలయమువైపునకు బోవుచుండెను. ఆవ్యక్తి పోవునప్పు డిటునటు పరికించుచు వచ్చు మనుష్యులను పరీక్షించుచు పోవుచుండెను. అది స్త్రీవ్యక్తిఅని చెప్పగలనిర్ధారణలు పెక్కులు గలవు. అదియట్లు పోయిపోయి జార్జిసార్వభౌముని చికిత్సాలయములో శస్త్రమందిరమున నొకరోగిమంచమువద్ద నిలుచుని ఆ రోగిని చేతితోతట్టి లేపి యిట్లు ప్రసంగించెను:—

వ్య—మిత్రమా! క్షేమమా.

రో.గి—కొంచెము క్షేమమేగాని నీ వెట్లుంటివి!

వ్య—నేనును క్షేమముగా నేయుంటిని ?

రో.గి—ఎక్కడ ?

వ్య—అక్కడే.

రో.గి—ఏమిచేయుచుంటివి ?

వ్య—ప్రస్తుతము చేసినపని భగ్నమైనది.

రో—ఏమైనది పూర్తిగాచెప్పు ?

వ్య—ఆమెకు విషప్రయోగము చేసితిని. అది క్రమముగా వృద్ధియై ఆమెను మరణ శయ్యను ప్రవేశపెట్టెను. తోడనే భూశయ్య చేసితిమి. ఇంకను ఆమె ప్రాణములపై ఆశలేదని నిశ్చయించుకొని, ప్రేమాస్పదునిలాగున నేనును దుఃఖించి గోలయెత్తితిని. అందరును నన్ను యోదార్చి నావిశ్వాసమున కెంతయు ఆశ్చర్యనిమగ్నులైరి.

రో—తరువాత ?

వ్య—తోడనే నేను యెట్టివైద్యులువచ్చినను ఆమెను బ్రతికించలేరని నిశ్చయించు కొని "పెద్దవైద్యులు కావలెను" అని గోలయెత్తితిని. అంతవారిలో కొందరు పరు గెత్తి సివిలు సర్జనును దీసికొనివచ్చిరి. ఆయన పరీక్షించి విషప్రయోగమని దృఢపరచి తగు యింజక్షను (Injuctions) యిచ్చెను. తోడనే ఆమెకు పోవు ప్రాణములు నిలబడినవి.

రో—అయ్యో! ప్రయత్నము వ్యర్థమయ్యెను. కాని నిన్నెవ్వరును అనుమానించ లేదు గదా ?

వ్య—అబ్బే ! అనుమానమా! యెన్నటికిని లేదు. ఇకముందు గూడ వుండదనియే నాయూహ.

రో—ఎందుచేత ?

వ్య—వారికిని బంధుగులకును యిరుగు పొరుగువారికిని నాయందు విశ్వాసము, భక్తి మెండు. ఈరాత్రి వాడు కమల యింటికి పోవునప్పుడునన్ను జాగ్రత్తయని చెప్ప యే పోయినాడు.

రో—బాగున్నదిగాని ప్రాణములను గాపాడికొను తెరవుచూచుకొని యుండుము

వ్య—ఏమియు భయమ లేదు. నాగు ప్రొద్దుపోవుచున్నది. నేపోయెద. పగలు తీరికలేమియును, నలుగురు నన్నుజూచి గుర్తింతురేమోయనియు నీదర్శనమునకు రావెరచితిని.

రో—బాగున్నది. అట్లేచేయుము. ఇంద్రజీ నీదర్శనమాత్ర మప్పుడప్పుడిమ్ము. కా నాయనా! ముందు తేదేమి? మనవాళ్ళెక్కడుండిరి? జాగ్రత్తగ పెట్టెలను గా చుండిరా ?

వ్య—ఈరోజుతో వానిపనిబట్టి కమలను దీసికొని పోవుటే! మనవాళ్ళందరు సత్రవున నెం 4, 5 గదులలో జాగ్రత్తగ కాచుచునేయుండిరి.

రో—బాగుబాగు గాని వానికెట్లు మట్టుపెట్టెదవు?

వ్య—వానికి మత్తుమందిచ్చి మరణోపాయమును విడకి యమసన్నిధానమునకు పంపెదను. విరోధమున పాలుత్రాగించలేముగాని స్నేహమున విషముత్రాగించవచ్చును గదా!

రో—జాగ్రత్తసుమా?

వ్య—మంచిది. పోవుచుంటినని నావ్యక్తి అంధకారములోనికి పోయెను ఆ రోగియు పరుండి నిద్రించుచుండెను. వీరి సంభాషణను బహుశ్రద్ధాభక్తులతో సమీపముననే యొక వ్యక్తి విని మనమున భయాశ్చర్యములతో తలపంకించి, కండ్లెర్రచేసి, మహా రౌద్రాకారముతో నెక్కడికోగాని చికిత్సాలయమునుండి రాజబాటగుండా పోవుచుండెను.

అంతట గంటలకొట్టువాడు టంగుటంగని అయిదు కొట్టెను. పద్దమ్మ మామూలుగా సుందర్రావుగారికి వాకిలి తుడుచుచు, పేడనీళ్ళను చల్లుచుండెను. ఎక్కడనుండి యోగాని సుందర్రావుగారు వచ్చుచుండిరి. పద్దమ్మ లోనున్న లక్ష్మీబాయిని లేపి బాబుగారు వచ్చుచుండుటదెల్పి తలుపును దీయుమనెను. లక్ష్మియు ప్రొద్దెక్కినదేమోయని తటాలున లేచి వీధి తలుపును దీసెను. సుందర్రావుగారు లోనికిపోయిరి.

---

## 19 వ ప్రకరణము

---

### పద్దమ్మ ప్రక్కలో బ్రాసయ్యెను.

సుందర్రావుగారేమియు స్వస్థతగానుండలేదు. ఆయనకు వంట్లోయగ్గతయో లేక చక్రవర్తిజాడలు గనుపించుటలేదని చింతయో తెలియదు. అధికారులు వానిని పలుసారులు తొందరపెట్టుటచేత వారికేమి ఆగ్రహము వచ్చునోయని గుంజుచుండెను. ఎంతవెదకినను చక్రవర్తిజాడలు దొరుకుటలేదు. కమల యింటివద్ద కాచియున్నను సత్రపువద్ద వేచియున్నను యీషణ్మాత్రమేని కూపీతీయ లేకపోయెను. కారణమూహించగల చతురుడేడి? సుందర్రావుగారికన్న చతురుడు వేరుకలడా? లేడు. లేడు. ముమ్మాటికినిలేడు. ఆయన దేనిని గురించియోగాని మిక్కిలి దీర్ఘముగా యోచించుచున్నట్లు గనపడుచుండుటచే లక్ష్మీబాయి మెల్లగ ఆయనదగ్గరకు వచ్చి కారణమారయ కుతూహలము గలదియై భర్తతో నిట్లనియెను. "ఏమండి! అట్లుంటిరి! వంట్లోకులాసాగాయున్నదా?"

సు—ఏమియు లేదు. రాత్రి నిద్రలేమి బద్ధకముగ నున్నది.

ల—పరుండెదరా?

సు—నిద్రపట్టునా?

ల—రాత్రి నిద్ర లేదంటిరిగాదా?

సు—అవును.

ల—అట్లయిన నిద్రపట్టకేమి?

సు—మనస్సు నిర్మలముగా నుండవద్దా?

ల—అంత ప్రమాదమేమి?

సు—పద్దమ్మ యేది?

ల—బజారునకు వెళ్ళినది.

సు—ఏ బజారునకు?

ల—కురపాం మార్కెట్టుకు.

సు—కూరలకా?

ల—అవును. ఈపూట కూరేమి వండమనెదరు?

స—నీ యిష్టము.

ల—సరేలెండి. కాస్తపరుందురు. అబద్ధకం తగ్గుతుంది.

సు—అవును. నేనును అట్లే తలంచుచుంటిని గాని, నిద్రపట్టదు.

ల—ఎట్లో పట్టించుకుంటేగాని బద్ధకం తగ్గదు.

సు—ప్రక్కలో త్రాఁచుండగా నిద్రపట్టునా?

ల—ప్రక్కలో త్రాఁచేమిటండి!

సు—తెలియలేదు. పొరపాటు.

ల—అయ్యో! అట్లనుచుంటిరేమి? ఒకమాఁటకును ఒకమాటకును సందర్భము లేదు. మీవంట్లో ఏలాగున యున్నది?

సుందరరావు నేదియో యోచించుకొని రహస్యము ఆఁడవాళ్ళతో చెప్పిన తప్పక తనకార్యమునకు విఘ్నముకలుగునని ధృఢనిశ్చయుండై భార్యతో నిట్లనియె. "కాస్త జ్వరము వచ్చినది. శాలువా దీసి కప్పి తలుపు దగ్గరగావేసి వెళ్ళుము." అంత లక్ష్మీబాయి తెలతెలబోయి భర్త చెప్పినట్లు చేసి తాను వంటజేయుటకుబోయెను. ఇంతలో బజారునకుఁ బోయిన పద్దమ్మ వచ్చెను. ఆమెవద్ద కూరలన్నియు బుచ్చుకొని జాగ్రత్తచేసెను. పద్దమ్మ యూరకుండలేక "అమ్మా! బాబేడి?" అని ప్రశ్నించెను.

ల—అంత లక్ష్మీబాయి యిట్లుచెప్పెను. "రాత్రి నిద్రలేదఁట. తెల్లవారుసరికి జ్వరము వచ్చినదని శాలువా గప్పికొని గదిలో పరుండెను."

ప—అయ్యో! బాబు అన్నివ్యాపారములను తానే చేస్తానని శ్రమనక తిరుగుతాడు. దానివల్ల శరీరమున కాయాసము యెక్కువయి యీలాటి జబ్బులు వస్తాయి.

ల—అవును పద్దమ్మ! తల్లీ! నేనేమి చేయను? అడదానిని? మన కీయుద్యోగము వద్దు, వున్నదానిని తిని వుందామంటే నామాట చెల్లనిస్తారా? చెప్పుతల్లీ!

ప—అవునమ్మా! అవును. నీ వేమిచేయగలవు? అయితే వైద్యుని తీసికొని రమ్మన్నారా?

అ—ఏమోనమ్మా! ఆయన నాతో నేమీ చెప్పరు. నాకు సుయ్యో గొయ్యో తప్ప వేరు దిక్కు లేదు.

వ—భరవా లేదమ్మా! నీవు కాస్త కనుక్కో! నేను వెళ్ళి డాక్టరును దీసికొని వచ్చెదను.

అ—అట్లే. అని గది తలుపు తీసి మెల్లన లోనికి ప్రవేశించి యిట్లనియె. "ఏమండి! పద్దమ్మ వచ్చినది. వెళ్ళి వైద్యుని పిలువమందురా?

సు—వద్దువద్దు. పెండలాడి కాస్త కారపొడి, చారుపెట్టు కాస్త యెంగిలిపడ తాను అంతకీ తగ్గకపోతే సాయంత్రము చూచుకోవచ్చును.

అ—అట్లే చేసెదను. అని గదినుండి బైటకు వచ్చి తలుపు దగ్గరగా వేసి పద్దమ్మ కావార్తను జెప్పి క్షణములో కైయింట నీళ్ళు పోసికొని, వంటారంభించెను. వంట అయిన తర్వాత మరల గదియొద్ద కొచ్చి సుందర్రావుగారిని లేపెను. ఆయన చాల విసుగుతో బయటకువచ్చి రెండు మెతుకులను దిని సావడిలో పడకకుర్చీపై గూర్చుండెను. అంత వార్తాపత్రికవా డొక పత్రికను ఆయన కియ్యగా దానిని జదువు నప్పటికి సుమారు నాలుగు గంటలయ్యెను. అంత ఆయనకు జిల్లా అధికారియొద్దనుండి చీటి యొకటివచ్చెను. దానిని జదివికొని బండి నొకటి కట్టించుకొనిపోయెను. పోవు నప్పుడు లక్ష్మీబాయి పద్దమ్మతో యిట్లనియెను. "ఏమి వుద్యోగమే!" ప్రాణము లకు కుదురులేదు. కాస్తజబ్బుగా నున్నప్పుడే అన్ని దాపరిస్తాయి."

పద్దు—అవునమ్మా! కాస్తజబ్బుగా నున్నది రాలేను అని యీయన వ్రాయ గూడదా! మన బంగారము మంచిదైతే కమసాలి ననుటెందుకు?"

అ—ఆయనతో వ్యవహారం కరట్టు. ఎంత ఓపిక లేకపోయినా సర్కారువ్యాపారం జరగాలి అంటారు-ఏమి చెయ్యను?

ప—బాగుండికాని కాస్త మంచిచెడ్డా చూచుకోవద్దా!

అని సాయంత్రమువరకు యేవేవో కబురులతో కాలక్షేపముచేయుచు, యింకను సుందర్రావుగారు రానందున కాయనకొఱ కెదురుచూచుచుండిరి.

సుందరావుగారట్లు జిల్లా అధికారియొద్దకుబోయి కొన్ని సంగతులను బహు రహస్యముగ జెప్పి ముందు కర్తవ్యమును గురించి యోచించసాగెను.

జి-అ—కార్య మేమిచేయుదురు?

సు—తప్పక యీరాత్రి వానిని బంధించెదను.

జి-అ—తొందరపడకుండ యింకను కొన్నిరోజులు చూస్తే బాగుండునేమో?

సు—ఇక ఆలస్యమును జేయగూడదు. పక్కలో త్రాచును త్వరగ బళ్ళెముతో పొడిచి చంపనియెడల ప్రమాదము వచ్చును.

జి-అ—ఆ స్త్రీమాట ?

సు—ఆ స్త్రీని, అనుచరులను యీరాత్రి యెనిమిది గంటలకు బంధింతును. మీ రప్పుడు వచ్చి పైకి ప్రకాశకాకుండ బందోబస్తుచేయాలి.

జి-అ—తప్పక చేతును. నాకు వర్తమాన మంపెదవా ?

సు—పంపలేను. నేనీకార్యమును యితరులకు దెలియకుండ నెరవేర్చి యింటికిపోయి ఆ కార్యమును జక్కబెట్టవలెనుగాని ఆలస్యముచేసిన అంతయు భగ్నమగును.

జి-అ—అట్లేచేయుము. నేను మార్గస్థునివలె ఆసమయమున కొచ్చెదను.

సు—మంచిది. "అని సుందర్రావుగారు శలవుతీసికొని బైటకువచ్చుసరికి మబ్బు గాఢముగాబట్టి దారి నగుపడకుండ చేయుచుండెను. అప్పుడప్పుడు మెఱుములు మిక్కిలి ప్రకాశమానముగ తళుక్కుమని మెరయుచుండెను. సుందర్రావుగారు నడిచి వడివడిగా సత్రవునకుబోయెను. నెం 4, 5 వ గదులలో జనులు లోపలి తలుపులనువేసికొని భోజనములు చేయుచుండిరి. శ్రమపడనక్కరలేకుండ సుందర్రావుగారు వానిని బంధించి చుట్టు పోలీసురక్షకభటులను కావలాబెట్టెను. అంతలో జిల్లాఅధికారి తుపాకిని చేతబట్టికొని సత్రవులోనికి వచ్చి సంగతారసి గదులచుట్టును గస్తీనిదిరుగువారి కుత్సాహమును గలుగజేయుచుండెను.

సుందర్రావుగారు యింటికి వచ్చుసరికి సుమారు తొమ్మిదిగంటలాయెను. లక్ష్మీబాయి ఆయనవంట్లో క్షేమముగా నుండుటకు సంతసించి భోజనమునకు లెమ్మని కోరెను. అంత భోజనములయిన తర్వాత సుందర్రావుగారు తన పడకగదిలో పరుండెను. ఆగది ప్రక్కనే వేరొక కొట్టుగది గలదు. దానిలో బియ్యము, కందులు, వగైరా సామగ్రియుండెను. తరువాత కొంతసేపటికి పద్దమ్మయు, లక్ష్మీబాయియు పరుండెను. పద్దమ్మ పరున్న వీధిగదికిని సుందర్రావుగారుపరున్నగదికిని ద్వారముగలదు. అదివరకు నది బంధింపబడియున్నను, ఆరాత్రిమాత్ర మెందుచేతనోగాని తీయబడి తలుపులు దగ్గరగ వేయబడియుండెను. సుందర్రావుగారందుచేతనేగాబోలు ఆరాత్రి యింట్లో వారికందరికిని నిద్రపట్టిన తర్వాత తాను తన పడకమీదనుండిలేచి, పెద్ద తలగడాను తన శాలువాను గప్పి తాను కొట్టుగదిలోకిబోయి కాచియుండెను.

కొంతసేపటి కొక వ్యక్తి పద్దమ్మ పరున్న గదితలుపును దీసికొని, సుందర్రావుగారి పడకవద్దకువచ్చి నిదానించి చూచి, రొండిలోనుండి యొకసీసానుదీసి, నందుండు అరకును కొంత గుడ్డమీదపోసి ఆ ప్రక్కమీద పరున్న వాని ముఖముమీదవేసెను.

ఇంతలో నావ్యక్తికి యొడలు ఝల్లుమనియెను. నోటినుండి మాటరాలేదు. వెంటనే పద్దమ్మ గదిలోనికి మరల నిష్క్రమించుటకు గాబోలు పోవుచుండెను. పాపము! కాళ్ళు ఆమె స్వాధీనములో లేవని అవ్యక్తి గ్రహించలేకపోయెను. ఒక్క

మూరు క్రిందికి పాదములవైపునకు జూచుకొనెను. "అబ్బా! ఎంతవాడవు! దేవాసురుల జయించినవాడవు. నాబోటి ద్రోహు లొకలెక్కా! నీకు నేను చాల తెలివితక్కువ వాడను. నీకు జోహారు! దుర్గాప్రతాపులనే జయించినవాడవు. నేను నీకు లెక్కా!" అనుకొనుచుండెను. పోయికురుందమన్న కాళ్ళను బలిష్ఠములగు యినుపగొలుసులు సంకెళ్ళుగా పడెను. కాని ప్రయత్నము మానక నొకమారు కాళ్ళు కదిపెను. బోరుమని క్రిందపడెను. లోనుండి సుందరరావుగారు వచ్చి "ఏమి! పద్దమ్మ పడిపోయితివి! నేలేవదీతునా! యని పలికెను. ఈగొడవంతయు విని లక్ష్మిబాయి లేచివచ్చెను. ఆమె పద్దమ్మఅవస్తనుజూచి నిశ్చేరపడి "ఇదేమి" ఈచిత్రమునకు కారణమేమి? అనిప్రశ్నించెను. అంత సుందరరావుగారు "పద్దమ్మ ప్రక్కలో త్రాచుగాదా? నీకు విషప్రయోగము నకును నాకీరోజున ప్రాణహానికిని కారకురాలు. పాపము! దైవ మామెనట్లు చేసెను." అని చెప్పెను. తోడనే పద్దమ్మయిట్లనియె —"బాబు! దైవము చెయ్యలేదు. నీవే తగిన ప్రాయశ్చిత్తము చేసితివి? నన్ను బాధపెట్టకు. నేను మరణించెదను." అను నంతలో వీధితలుపును యెవరో తట్టిరి. అంతలక్ష్మిబాయి తలుపును దీసెను. ఇద్దరాంగ్లేయులు లోనికి వచ్చి యీనాటకమును జూచి నిశ్చేరపడిరి. వారిని జూచిమిక్కిలి ఖిన్నుడై నిలచియున్న పద్దమ్మఅనే భయంకరచోరాగ్రేసరచక్రవర్తి తాను జీవించుట మిక్కిలి యుత్కృష్ట మనుభవించుటగాని వేరు ప్రయోజనము లేదని, తన వక్షస్థల మందు బట్టలో గుప్తపరచిన పిస్తోలుతో గాల్చుకొని చచ్చెను.

---

## 20 వ ప్రకరణము.

### కమల సంతోషము

చక్రవర్తి రాత్రి సుందరరావుగారియింట చనిపోయెనని వానియనువానియనుచరు లందరు సత్రవులో బంధింపబడిరనియు తెల్లవారుసరికి యూరంతయు తెలిసినది. కమల సంతోషమును చెప్ప నలవిగాకుండెను. సుందరరావుగారు చక్రవర్తి శవమును యూరంతయు నూరేగించి దహనపర్చుట కుత్తరువిచ్చిరి. వారి యనుచరుల సుమారు 40 మందికి బేడీలు వేయించి చెరసాలకు దీపికొని పోవుట కుత్తరువిచ్చిరి. కమల చరాస్తినంతయు నామెకు వప్పగించి ఆమెను సురక్షితముగ నుంచి తనకిష్టమగు నొకమగపిల్లవానిని దత్తతచేసికొనుమని చెప్పిరి. కమలయు మిక్కిలి సంతసించుచు న్యాయధికారుల కనేకములగు వందనములు చేసెను. చక్రవర్తి సుంద రరావుగారియింట్లో మరణించిన సంగతి తెలిసికొని దాదా యసువులం బాసెను. తరు వాత జిల్లాయధికారి సుందరరావుగారు పడిన శ్రమకును ఆందోళనమునకును కాన్య

సాధనమునకును మిక్కిలి సంతసించి యిట్లనియెను.

జి-అ—మీరు ఆరాత్రి ఆసుపత్రిలోనికి పోయి వేరొక మంచముమీద పరుండి మీరు దాదాతో చెప్పువార్తలను వినకున్న యీకార్య మింతలో కొనసాగకపోవునే గాక మీకు ప్రాణహానికూడ తటసించెడిది.

సు—చిత్తమగును. నే నూరకుండుటచేత నేకదా నాభార్యకు చావుదప్పి కన్నులొట్టపోయినది.

జి-అ—అవును గాని అప్పుడు మీరు చాలా ఆమెనుగురించి శ్లాఘించితిరే!

సు—ఏమిచెయ్యనండి. వాడట్లు ప్రవర్తించినాడు. నాకే గాదు అక్కడకొచ్చిన వారందరకును యిట్లే దోచినది—

జి-అ—పోనీ లెండి. మీ రీకార్యములో కృతార్థులైతిరి. నేను దొరతనము వారికి వ్రాసితిని. మీకు శాశ్వతమైన మేలు త్వరలోనే చేయుదురు.

సు—చిత్తము తమదయా సంపాదనమేగ. అంతే నాకు కావలసినది. వేరు కోరికలు

).

జి-అ—మంచిది. మనము పోవుదము!

సు—చిత్తము చిత్తము. ఆలస్యమెందుకండి?

అని నాల్గురును వారి వారి నెలవులకుఁ బోయిరి——

ఇది శ్రీమాద్గల్యసగోత్ర పవిత్ర వాడ్రేవు కామరాజు సూరమాంబా
గర్భ చతుర్థ పుత్రుండును, శ్రీ గార్గేయసగోత్ర పవిత్ర
కాశీగారి వెంకటాచలం అన్నపూర్ణాంబా గర్భం
జ్యేష్ఠ జామాతయు నైన వాడ్రేవు మల్లపరాజు
ప్రణీతంబైన భయంకర చోరాగ్రేసర
చక్రవర్తి యను కల్పిత
సరస పరిశోధక నవల
సర్వమును
సంపూర్ణము

---

గ్రంథకర్త - పానుగంటి.

[illegible]ముంచెవారి ప్రతిభావిశేషాలకు పట్టుతేంపాగ, హాస్యరసాన్ని తరచి తరచి పొందిన అమృతాక్షర స్వరూపం, ఆధునికాంధ్ర సమాజంలో అందందు పొడచూపే అత్యాచారాలను అంహాస్యంగా కనబడకుండా అయ్యలనూ, అమ్మలనూ అల్లరిపాల్జేసిన అసదృశమగు నాటకం.

ఒక రాజు కిద్దరు భార్యలు. లోకాచార ప్రకారం చిన్నరాణి చెంగు చెంగున క్షితీశ్వరుని గుండెల్లో చిందులేయ సాగింది. నోట్లో నాలుక లేదు, పలుకుల్లో కరకుదనం లేదు, అంటూనే మొగుడి నెత్తిమీద మొట్టుతూ, సవతి సంసారానికి చన్నీళ్లతోడి, యువరాజైన సవతికొడుక్కి [illegible]శిక్ష వేయించాలని ఉబలాటబడి, చవిటిదద్దమ్మ అయిన తనకొడుక్కి [illegible] రాజ్యాన్ని కట్టిపెట్టాలని తహతహలాడి అనేకమైన అవకతవక[illegible]సిన అమ్మగారి హాస్యరసపూరితమైన జీవితగాథ, యిది.

సవతుల సంసార సౌఖ్యాన్ని సంపూర్ణంగా చిత్రించ కలిగి ఇందులోని భావమూ, భాషలోని హాస్యాన్ని విశేషించి చె[illegible] సూర్యుడ్ని చూపడానికి కాగడా యెత్తడం. వెల రు 1

## ముద్రిక

గ్రంథకర్త - పానుగం[illegible]

మొగుడికి ముండలమీద మోజు, భార్యకు పాతివ్రత్యం ప్రాణం! చేతులో సిరి చిందులేస్తోంది, ఆజ్ఞకు లోకం అడలిపోతు[illegible] క్షణక్షణపరివర్తన పొందే అతని భోగలాలసత్వం క్రింద ఎన్ని తాళి తెగలడిపోయినా, ఎన్ని సంసారాలో మున్నిపోయినా. ఈసుదే కామపిశాచానికి బలిగా ఒక సుక్షత్రియ కన్న బలాత్కారంగా [illegible] ఆమెనే మహారాణిగా చెయ్యాలని ఆ మహారాజు తొందరపడ్డాడు. చూసి చూసి, అతని భార్యలోవున్న సహనం కాస్త చచ్చిపో[illegible] మెత్తమెత్తగా చెవి మెలేసే ఓ దాసికన్నను ఆమె చేరదీసింది. [illegible] కథ ప్రారంభమైంది.

[illegible] పలుకులతో, పలుకు కులుకులలో, కులుకుముల్లు [illegible] [illegible]రి వలపుచెలికాని లొంగించుకుని, బుగ్గపో[illegible] అంతా నవ[illegible] ముసినవ్వులతో రాజుగారి ముద్రిక సహా ఆయన్ని బంధించి, కాముని కౌగిట్లో క్షత్రియకన్నె చిక్కు విడిపించి రాణి కంటినుం[illegible]ళ్లు కరిగించింది. వెల రు.

ప్రాప్తిస్థానము : సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

## "సరస్వతి"

నటరాజూ పలుకుతల్లీ, కూడ కలుగల ప్రదేశం పానుగంటివారి బుద్ధి, వారిలేఖినిలో నవ్వులపువ్వులు జాలువారుతై. ఈసరస్వతీ నామక నాటకరాజం సరస్వతీదేవికో చక్కని కానుక. షేక్స్పియర్ కామెడీ ఆఫ్ ఎర్రర్సు' అనేనాటకం వ్రాసి ఖ్యాతి గడించాడు. అదేవిధమైన గాథను అంతచక్కగానూ సృష్టించి పానుగంటివారు అమృతత్వం పొందారు. కొన్ని గృహచ్ఛిద్రాలవల్ల అన్నా చెల్లెలూ యిల్లువదలి వెళ్ళారు. అన్నకు ఆడవేషం, చెల్లికి మగవేషం దాంతో సిద్ధించినై. స్త్రీ వేషంలో వున్న అన్నను చూచి ఓ రాచకుమారుడు వరించాడు. పురుషవేషంలో వున్న చెల్లెలిని చూసి ఓ రాకుమారి మోహించింది. ఆనాటకం నడపడం లోనే వుంది కవిగారి సిద్ధహస్తం.

మగవేషంలో వున్న అమ్మాయిని రాకుమారి పెళ్ళిచేసుకోమని వర చేస్తుంది. అప్పుడతడు తనలో

మూగమూగతోడ ముచ్చటాడినయప్పు, డంధు డంధుగాంచి యలరునపుడు,
కవికింగవికి మనసు కలసినయప్పుడు, నాకు నీకు గంకణాల సొగసు.

అంటాడు.

ఆడవేషంలో వున్న అన్నగారిలా వాపోతాడు.

కొంగరైనను సన్యాసి లుంగి దాల్చ, భిక్షమిడువార లెందరో వెలయుచుందురు
రుషుడైనను స్త్రీరూపమునను తిరుగ, ముద్దులిచ్చెడి మగలకు హద్దుకలదె."

ంగా నడిచింది. ఈనాటకం చదవటంలోనే సరసం వుంది. అర్థంచేసు
కంలోనే ఆనందం వుంది. వెల 1-4-0.

## ంగుతల్లి"

వేదాంతకవి-ప్రణీతము.

వేదాంతకవిగారి కలంలోంచి వేడిరక్తంగాని, ప్రవహించదా, అని
ది. పేదరికాన్ని రూపుమాపటానికీ తెనుగుతనాన్ని నిలబెట్టడానికీ
మనస్సు పరువులు తీస్తుంది. ఆంధ్రభారతిపడే అగచాట్లు యీకవిగారి
నయాన్ని కరగించి యీ నాటకాన్ని సృష్టించినై. ధనమదాంధుల
త్వం, కవీంద్రులకన్నీరూ, విశ్వదాతల ఆదరాభిమానాలూ, పు
ంగా గల యీనాటకం ఆంధ్రదేశంలో అన్నిచోట్లా ఆడబడ్డదే.
లగోపాలంచేతా అభినందింపబడ్డదే, కదంతొక్కే కవిత్వం కావా
కున్నవారూ, పైడిముక్కలవంటి భావాలు కావాలనుకున్నవారూ
[illegible]

వెల 1-4-0 మాత్రము.

బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.